ఓమ్

# సారస్వతనికేతనము - వేటపాలెము

## జయంత్యుత్సవములు

## ఆహ్వానము

స్వస్తి శ్రీ వృషనామసంవత్సర ఆశ్వీయుజ శు 3 మంగళవారము నుండి శు ౧౦ లు మంగళవారము (23-9-41 నుండి 30–9–41) వరకు జరుపబడు **24** వ జయంత్యుత్సవసభలకు తాము బంధుమిత్రులతో విచ్చేసి సన్తోషానందింపజేయ వేడుచున్నాడను.

30–9–41 తేదీ మంగళవారమున జరుగు
ఇరువదిమూడవ వార్షికోత్సవసభకు
గుంటూరుజిల్లా విద్యాశాఖాదికారి

**శ్రీ దంతాల రామయ్యనాయుడుగారు**

అధ్యక్షతవహించుటకు దయతో నంగీకరించిరి.

**వేటపాలెము,**
17–9–41.

**పూటుకూరు జయరామదాసు,**
ధర్మకర్త.

(పోషకవర్గసభ్యుల కృతానేకవందనములతో)

కార్యక్రమము ప్రక్కపుటలయందు ముద్రింపబడినది

# కార్యక్రమము

## 23—9—41 మంగళవారము

**హిందూమతము'** (ఉపన్యాసము)—

శ్రీయుత జటావల్లభుల పురుషోత్తముగారు, M. A.
కొవ్వూరు సంస్కృతకళాశాల ప్రధానాచార్యులు.

## 24—9—41 బుధవారము

**ఉత్తమకావ్యము'** (ఉపన్యాసము)—

శ్రీయుత జటావల్లభుల పురుషోత్తముగారు, M. A.

## 25—9—41 గురువారము

**భారతసమస్య'** (ఉపన్యాసము)—

శ్రీయుత ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారు, B. A.
పల్లెటూరు గ్రంథమండలి సంపాదకులు, తణుకు.

## 26—9—41 శుక్రవారము

**శ్రీదేవీలాస్యము - మతదృష్టి'** (ఉపన్యాసము)—

శ్రీయుత జమ్మలమడక మాధవరామశర్మగారు,
తెనాలి సంస్కృతకళాశాలాచార్యులు

## 27—9—41 శనివారము

**ఆత్మదర్శనము'** (ఉపన్యాసము)—

శ్రీయుత కొండూరు వీరరాఘవాచార్యులుగారు,
(ఉభయభాషాప్రవీణ, కోవల్లి)

శ్రీరస్తు
శ్రీ గణేశాయనమః
శ్రీ రాధాకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ రుక్మిణీ పరిణయము.

శ్లో॥ కృష్ణంకమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనం
వాసుదేవంజగద్యోనిం నౌమినారాయణం హరిం

శ్రీవైశంపాయన మునీంద్రుండు జనమేజయ నరేంద్రున
కిట్లు చెప్పుచున్నాఁడు.

శ్రీరమణీమణికి నిత్యనివాసభూతంబై, నందనందను విలాస విహారంబుల కాస్థానంబై, సకలసుఖంబులకుం గాపురంబగు ద్వారకాపురంబు రెండవ వైకుంఠంబుకరణి కరంబు చెలువొందు చుండు. ఆ నగరీలలామంబి తరపట్టణంబులవలె మానవకల్పితంబు గాక, దేవతావిశ్వకర్మయగు మయునిచే నిర్మితంబై శ్రీకృష్ణపరమాత్మునకు బహుమానంబుగా సమర్పింపఁబడినది. అందలి మందిరద్వారంబుల సౌందర్యవిభవంబు పురందరా ...ల లోకంబులంగూడ లేకుండుటచే నాపురంబునకు ద్వారక ...కును సార్థకనామంబు గలిగె. అయోధ్యాది ముక్తిదాయకంబు ...గు నేడుపురంబులలో నొక్కటిగ లెక్కింపఁబడి శ్రీహరిని ...శింప నేగువారలకు ముక్తిద్వారం బగుటచేతను ద్వారక ...యని చెప్పనొప్పుచుండె. శ్రీమన్నారాయణుండు వారాశి

విహారి యగుటచేతంగాఁబోలు కృష్ణావతారంబునంగూడఁ దన పురంబును వారాశిమధ్యంబున నేర్పఱచుకొనియె. అందలి రత్నసౌధంబు లత్యున్నతంబులై సుధారుచులచే సుధాకర శతంబుల కరణి నేత్రపర్వంబులై వెలుగొందుచుండు. లోకారాధ్యుండగు నల్లుఁడు తనయింట సకుటుంబముగాఁగాపురంబుంటచే నానందించి రత్నాకరుండు కానుక లొసంగుచుండునోయన వీచికాకరంబులనే నవరత్నరాసుల దినదినంబు నొసంగుచుండును. తమ్ముఁబెంచినకురంగీదృశ లందలి సౌధశృంగంబులపై సంగీతంబులంబాడ సవ్వడింబట్టి వారి చెంగటికేగుకురంగాంగనలు గరుడపచ్చలగోడల నీడలంగని పచ్చగడ్డి యను భ్రమచే మేయంబోయి ద్వారంబులపై నిర్మింపఁబడిన వ్యాఘ్రచర్మధారులగు మానులంగాంచి బెగడొందుచుండు. అప్పురికరితురగరథంబుల సౌష్ఠవం బెందును లేదని సాటించుచుండెనోయన నంభోధిగంభీరధ్వానంబులఁ గావించుచుండు. అందలి సర్వజంతు సంతానంబులును శ్రీకృష్ణభగవానుని కరుణారసప్రసాదముచేఁ బూర్ణారోగ్యవంతంబులై సర్వభోగంబు లనుభవించుచు దర్శనారాధనాద్యుపచారంబులచే శ్రీహరి విచారంబు దప్ప నన్యవిచారంబెఱుంగక యానందాబ్ధి నోలలాడుచుండును.

అట్టి ద్వారకాపురీలలామంబున సర్వదా పాదాక్రాంత నిఖిల భూనాయకుండును, సౌందర్యవిజితకుసుమసాయకుండును, ఆశ్రితజనాభీష్టదాయకుండును, నగు శ్రీకృష్ణ యాదవనాయకుండు పదియాఱువేల గోపికలకు మనోనాయకుండై, రుక్మి

సత్యభామాద్యష్టభార్యలకుఁ బ్రాణనాయకుండై వసియించు చుండును. భూతలంబున నెట్టి మహాయోగులకేనియు శ్రీహరిని ధ్యానింతమన్నఁ జిత్తంబు తొలంగక వాసుదేవాయత్తంబై యుండుట కడు దుర్లభంబు. ఆ గోపకాంతలెన్నాంతం బావంత యేని చలింపక హరిసేవాపరాయణంబై యుండు. వారలందఱు సర్వకాల సర్వావస్థలయందును శ్రీకృష్ణునిధ్యానించుచుఁ, సేవించుచుఁ బూజించుచు,జపించుచుఁ,దపించుచు,మ్రొక్కుచు, నర్మోక్తులాడుచు, వేఁడుచుఁ, బాడుచుఁ గూడుచు విడనాడక వేడుకల నోలలాడుచుండురు. ఇంతయేల? వారు పూర్వజన్మకృతమహాపుణ్యవశంబున నలుమరలేని హరిప్రేమామృతమును జూఱగొనఁ బ్రియాంగనలై జన్మించిరి. సర్వోన్నతుండగు విభునకుఁ బ్రియభామినులగుట స్త్రీలకు మహాతపఃఫలంబుగదా!

శ్రీమహావిష్ణువు మధురాపురంబున దేవకీ వసుదేవుల కుం బుట్టి, గోకులంబున యశోదా నందులచేఁ బెంపఁబడి వార్ధి మధ్యంబున నివసించుట లీలావశంబునంగాని వేఱొండు కారణంబునంగాదు. ప్రస్తుతమున గయాపట్టణంబని పేర్కొనఁ బడు గిరివ్రజపురమున కధీశ్వరుండై యువక్రవిక్రముండగు జరాసంధుండు తననుసంహరింపఁబదునేడుసారులు మధుర పై దండు వెడలఁ గయ్యంబున వానికి వెఱచి కృష్ణుండు వార్ధిమధ్యంబునఁ జేరెనని వాసుదేవునందుఁ గొంద ఱశక్తత నారోపింతురుగాని యది వాస్తవంబుగాదు. దుస్సంధుడగు జరాసంధుండు చివ్వకుం దనపై కేరాఁగ సర్వజ్ఞుండగు దేవకీనందనుండు భీముని చే

వాఁడు మఱియు నట్లు విధి వ్రాసెననియు, నట్టివానిం దాఁ ద్రుంచుట యనుచితంబనియు, వసుదేవాయుపుత్రు ప్రేరేపించి వధింపించుటకు వాని నవిత మప్పటికి సమాప్తి కాలేదనియు, వాని పాపపరిపాకంబె తగుకాలంబున వానిం బెగటార్చుననియు నెఱింగి తాఁ బరాభూతుండైనట్లు నటించెనుగాని నిక్కంబుగ వానికి వెఱచి కాదు. యథార్థంబుగ వానిం ద్రుంపనెంచినచో నిమిషకాలంబున లోకత్రయంబు నాక్రమించిన త్రివిక్రమమూర్తి కది లెక్కయగునే? కంసాదులవధించుటకుఁ గాలంబుఁ బ్రతీక్షించుటయు, నవతారభేదంబుల నాయాకాలంబుల ననేకమహాకార్యంబులఁ బలుతెఱఁగులఁ గావించుటయు, సర్వజ్ఞుఁడగుటంబట్టియే యని తత్త్వజ్ఞులు గమనింతురుగాత.

కం॥ కర్మమునఁ బుట్టుజంతువు
కర్మమున సమృద్ధిఁ జెందుఁ గర్మమున జెడుం
గర్మమె జనులకు దేవత
కర్మమె సుఖదుఃఖములకుఁ గారణమధిపా!

ఎట్టిరూపవిలాసములుగలవిభుండు మనఃప్రియుండని యేయే కాంత లభిలషింతురో భగవంతు నెట్టిరూపముగలవానిగా నే యేభక్తులుభజింతురో వారికందఱకుఁ గృష్ణుండట్టిరూపంబునం గనుపట్టుచు లీలావినోదియై, పరమసుఖాపాదియై ప్రవర్తించుచుండును.

కృష్ణుని యష్టభార్యలలో సత్యభామ మిగుల వన్నెకెక్కిన నెఱజాణ. ఆ యిందువదన గోవిందుని సుందరదనలలో నెల్లఁ బరగు

సుందరి. ఆహరిణాక్షికి శ్రీకృష్ణునియందుఁ బరమానురాగము. ఆభామామణి తనవచోనైపుణ్యంబుచే, నుపచారవిశేషంబులచేఁ బ్రేమాతిశయంబుచే విభునిమదిని రంజిల్లఁజేయుచు నాగోపాలచూడామణిని దనహృదయదర్పణంబున క్షణంబేని గనుంగొనకుండునది కాదు. యదువల్లభుండును ఆమెభక్తివిశ్వాసములకు మెచ్చి యాయువతికి వశవర్తియైనట్లు మెలంగుచుఁ గడుంగడుఁజనవొసంగుచుండు. దానంజేసి సాత్రాజితి హరికిఁ దాఁబ్రియభార్యననియు, నందఱకంటెరూపవతిననియు, బరమభక్తురాలనసియు, భర్తతనకువశుండనియు, నించుకమనోగర్వంబునొంది యొక్కొకయెడ విశృంఖలవృత్తితోఁ జరించుచుండును. సర్వదాహరిదర్శనాభిలాషిణియగుటంజేసి, శ్రీకృష్ణుని బ్రార్థించుటంబట్టి యతికాముకురాలని యజ్ఞులు సత్యపై నపనింద నారోపింతురుగాని యదినిందాస్పదంబు. అదివాస్తవంబేని భగవంతుఁడు భక్తిబంధంబునం బట్టువడును గాని స్వల్పంబులగునన్యవిషయంబుల బద్ధుండగునే? భక్తితారతమ్యము చేతనే యితరభార్యలయెడంగూడఁ జిక్కువడియుండె.

కం॥ చిక్కఁడువ్రతములఁ గ్రతువులఁ
జిక్కఁడుదానములశౌచ శీలతపములం
జిక్కఁడు యుక్తిని భక్తిని
జిక్కినక్రియ నచ్యుతుండు సిద్ధముసుండీ.

## రుక్మిణీ ప్రభావము

### —సత్యాకృష్ణుల విలాసము.

ఒక్కయెడ సత్యాకృష్ణులిరువురును భామామణి సదసంబున బంగరపుటుయ్యెల నూఁగుచుండిరి. చెలికత్తియలు సురటులంగొని వీచుచుండిరి. అచ్చటి శుకకోకిలంబుల మధురతరరుతంబులు వీనులకు విందొనర్చుచుండె. అగరుధూపంబులు ఘ్రాణపర్వంబొనర్చుచుండె. చిత్రలేఖనంబులు లోచనంబులకుం దృప్తి గావించుచుండె. వారియెదుట మణికుడ్యమున్న నమర్పంబడియుండు నిడ్డంబగు నిలువుటద్దంబునం బ్రతిబింబించు నా పుణ్యదంపతుల యగణ్యలావణ్యాగణ్య జగన్మోహన దివ్యసుందర విగ్రహంబులు వర్ణనాతీతములై వెలుఁగొందుచుండె. అపుడు సత్యభామ యామకురంబున శ్రీకృష్ణుని రూపవిలాస వైభవంబును నిర్నిమేషయై వీక్షించుచు; నమ్మహానుభావుండు తనకుం బతియగుట పరమ భాగ్యంబుగా నెంచుచు, నానంద వివశయై యిట్లనియె,

సత్య—స్వామీ! తమ యనుగ్రహముం గోరిన యీ దాసురాలు దేవరవారికేమి కైంకర్యము సలుపఁదగునో సెలవొసంగ వేఁడుచున్నదాన. పాదసేవ యొనర్తునా?

కృష్ణ—ప్రేయసీ! యీవేళ నదియనవసరము.

సత్య—హృదయేశ్వరా! యట్లయినచోఁ దమ జగన్మోహన

శరీరమును దనివిదీర రత్నాభరణంబులతో నలంకరించి ధన్య నగుదునా?

కృష్ణు—ప్రాణప్రియా! కనుగందని నీకరకిసలయము కర్కశ ములందవిలి నొచ్చును గాన నద్దాని నపేక్షింపను.

సత్య—మనోవల్లభా! యత్లేనిసువాసిత కుసుమమాలికల నెఱ కురులంగూర్చి, మేనం గలపంబలఁది యనుగ్రహ పాత్రి నయ్యెదనా ?

కృష్ణు—అన్నులమిన్నా! నీనయనకుసుమంబులు నా మేనలం కరించె; నీతనులతాసంస్పర్శనానం దుల్లంబునుజల్లపఱిచె. ఇంక వేఱగు నీయుపచారంబులేల ? నీసుకుమారాం గంబు నొవ్వఁజేయ నామనసొప్పకున్నది.

సత్య—పరమపురుషా! అట్లయినచో నే ధన్యనగు టెట్లు? పరమ పవిత్రములగు భగవద్గుణ గణంబుల నీ వీణంగొని గానంబు సేయుదునా ?

కృష్ణు—సతీమణీ! నీమధురాలాపంబులే నాకు శ్రవణానందము. అయినను నీవు కోరినట్లు నీగానామృతముచే నాచిత్త మునకుఁ దృప్తిగావింపుము.

(సత్యభామ వీణం గైకొని "నీరదనీలకళేబరా కృష్ణా నిరుపమ కౌస్తుభకంధరా" అనుచు గానం బొనర్చె.)

కృష్ణు—ఆహా! సత్యభామా యేమి నీ చాతుర్యము. బంగరు

జిగినిగేరు నీమెయి దీఁగెయందు రత్నహారముల కరణి శోభిల్లక నానీలదేహమునందీ కౌస్తుభము వికారరూప ముఁగా నుండెననియూ పరిహసించెదవు. ఎట్టి సువర్ణమైనను నీలమణికి సాటిరాదు సుమా!

సత్య—మనోహరా! తమస్వరూపంబును వినుతించితిని గాని వేఱుగాదు. తమ చక్కఁదనమునకు సాటిగలదే? తమకిది యప్రియంబేని మఱియొక దానిం బాడెద. దయ చేసి యాకర్ణింపుఁడు.

కృష్ణు—సుందరీ! బాగుబాగు మఱియొకదానిఁ గూడఁ బాడి నీవిద్యావైశద్యముం జూపుము.

సత్య—“రాధాకృష్ణా కాళీయవిషధర భంజనా” (అని గీత గోవిందమును బాడెను.

కృష్ణు—భామా! యిందును నన్నే యాక్షేపించెదవా? స్త్రీలో లుండనుటకు రాధాకృష్ణయనియు, పాములఁ బట్టువాఁడనుటకు కాళీయవిషధరభంజనాయనియుఁ బరిహసించెదవా? భళీ! ఏమి నీకౌశలము.

సత్య—స్వామీ! భక్తపాలనశీలుండవనియు, లోకద్రోహులం బరిమార్తువనియు, వినుతించితిగాని యాక్షేపించితినని తలంపకుఁడు; నందనందనా! తమయందు భక్తిలేనివా రెవరు? ఆరాధ భక్తురాలుకాదా? నేను భక్తురాలను గానా? తమరు నన్నందఱకంటె హెచ్చుచేసి యుఱి

మరలేని చనవొసంగి భామా యని నోరారఁ బిలిచి గారవించు తమయెడ నేనపరాధినినైతి నందు రేని క్షమింప వేఁడుచున్నదాన.

కృష్ణ—ముద్దులగుమ్మా! యేనువిలాసో క్తిగా నిట్లంటిఁగాని నీభక్తి స్తుతిపాత్రమై యున్నది. వెఱవకుము. సుదతీ మణీ! యిప్పటికి నాకొఱకా రుక్మిణీమణి వేచియుం డును. కావున నచ్చటి కేగివచ్చెద.

సత్య—హాధా! తమర మ్మోహనాంగి కడ కేగి యామె లీలా వినోదంబులం జిక్కి, నన్ను మఱతు రేమో? తమను దర్శింపని తృటికాలంబొక మహాయుగంబుగా నుండు, కాన శీఘ్రముగాఁ బునర్దర్శన భాగ్యమనుగ్రహింప వేఁడెద.

అని ప్రార్థింప నట్లై యగుఁగాక యని వాసుదేవుండు బయలువెడలి రథారోహణంబుసేసి చనుచు నీ సాత్రాజితి ప్రేమ యనిర్వ్యాజంబ కాని తానెక్కుడు ప్రేమాస్పదురాల ననియుఁ, దానందఱికంటె నెక్కుడనియు, గర్వవతియైయున్న ది ఈమె గర్వంబు భంగముగావించి చూడవలయు. మెత్తని చిత్తంబుగల భర్తల నొత్తుటయు, గఠిన హృదయులగు పతు లపైఁ బ్రేమలేకుండుటయు, నిది స్త్రీలకు స్వభావంబు కావున వనితలయెడఁ గాఠిన్యమార్దవంబులఁ జూపక సమయోచితం బుగా సమభావంబున మెలంగుట పురుషుని కౌశలము. అని తలంచుచుఁ నేగె.

### నారదుం డింద్రలోకంబున కేగుట

స్ఫటిక సన్నిభంబగు శరీరచ్ఛాయ హృదయనైర్మల్యంబును, దీర్ఘజటాపటలంబు పరిపూర్ణవైరాగ్యంబును, కరస్థంబగు వీణయు, రెండవహస్తము నందలి తాళంబును హరిభక్తుండనుటయు నోరులు చెప్పకయే చెప్పుచున్నవి. అమ్మహామునికాశ్రితులకు ధర్మోపదేశము సేయుటకంటె నితరకార్యంబులేదు. అమ్మహాత్మునకు హరిభజనాపేక్షతక్క నితరాపేక్షయెద్దియును లేదు. ఆపరమ మునీంద్రుఁడెవ్వరో కాదు. మనము వినుచుండు నారద మహర్షి. అమ్ముని యందొక విశేషము గలదు. పరులకు ధర్మబోధచేసియో, కలహము గలిగించియో, కష్టపెట్టియో, వారలఁ గీర్తివంతులుగను, భక్తిపరులుగను జేసి, ధన్యులం జేయుట యాతనికి సహజగుణము. ఆమునీంద్రు డట్టిపనికై సర్వదా సర్వలోకంబులం గ్రుమ్మరుచుండును. ఇట్టి పనికంటె నుత్తమకృత్యంబిక నెందును లేదుగదా! అయినను అదేమి ప్రారబ్ధమోకాని యాతనికిఁ గలహాశనుండను పేరు ప్రసిద్ధంబయ్యె. ఎవ్వరికైన నెట్టిపేరయినను రానున్నది రాకమానదు గదా! ఆనారదుం డొక్కయెడఁ బాతాళలోక విశేషంబుల నీక్షించి మర్త్యలోక చర్యల నుపలక్షించి, సురలోక ప్రవర్తనంబవలోకింప నేగుచుండె.

అచ్చట నింద్రుండు సుధర్మాసభాస్థానంబునఁ గొలువు దీరియుండె. ఆసభాస్థలము వజ్రవైడూర్యాది నవ్యదివ్యమణి ప్రభాపటలంబుచేఁ గోటిసూర్యప్రకాశమానంబై వెలుగొందు

చుండె. అది నిరంతర సకలవైభవాస్పదం బగుటచే నందలి యెల్లవారు నానందాబ్ధి నోలలాడుచుండిరి. సురగరుడోరగసిద్ధ విద్యాధరాదులెల్ల నియమిత పీఠంబుల నాకసంబున నక్షత్రంబుల వడువున నక్షీణప్రభలఁ దేజరిల్లుచుండిరి. రంభోర్వశ్యాద్యప్సరోగణంబులు మధురగానలయాదుల కనుగుణంబులగు నర్తనవిశేషంబులచే రంగస్థలంబుల నలంకరించుచుండిరి. వశిష్ఠవామదేవ కణ్వకాత్యాయనాది బ్రహ్మర్షివరిష్ఠుల ఋగ్యజురాది నిగమాశీర్వాదనాదంబులు శుభసంపదల వెల్లివిరియించుచుండె. మందార పారిజాతాది కుసుమ విసరామోదంబులామోదదాయకంబులై యుండె. సురాచార్యుండుపదేశించు వేద వేదాంతార్థ సుధాసారంబు సభ్యుల కితరాసక్తిని మఱపించుచుండె.

అమ్మహాపరిషన్మధ్యంబున మహేంద్రుఁడు వాగగోచర మహావిభవుండై నిత్యోత్సవంబున నెగడుచుండె. బ్రహ్మాది లోకంబులందు గూడ నిరాటంకముగా విహరించు నారద మునీంద్రుఁడా సురేంద్రుని సభాస్థానంబునకు హరికీర్తనంబు సేయుచు నరుదెంచె. ఇంద్రాదులెల్లరుం దదాగమనంబున కుత్సహించుచు నిజపీఠంబులనుండి మునిం గౌరవించి తదంగీకారంబున మఱల విష్టరంబుల నుపవిష్టులైరి. అత్తరి పాకశాసనుండు వినయంబుగ దురఁగరకమలంబులు ముకుళించి 'సంయమివరా! తమరఖిల లోకంబులందలి యుత్తమ జనానీకంబులఁ పరమధర్మాలోకంబుచే నజ్ఞానతిమి

రంబు హరించి ధన్యులం జేయుచుందురు. తమబోంట్ల జన్మంబు లోకానుగ్రహార్థంబకదా! తమరు సర్వజ్ఞులు గావున నుత్తమ లక్షణంబుల నుపదేశింపుఁడన నమ్ముని యాత్మస్వరూపంబును, పరమపదము ప్రాపించు మార్గంబును, జ్ఞానయోగంబును, భక్తి యోగంబును, కర్మమార్గంబును, తీర్థసేవామహిమంబును, సత్ప్రవర్తనాది నీతివిధులం బోధించె.

ఇట్లు ధర్మసూక్ష్మములఁ దెలిపి శ్రీకృష్ణుని దర్శింప నెంచి మానవలోకంబున కరుదేర నాసీరంబునుండి లేచె. అపుడు శచీరమణుండొక పారిజాతప్రసూనంబు నమ్మునికొసంగి స్వామీ! యెందేగెదరని నుడువ నత్తాపస వరుండిట్లనియె.

పురందరా! యిపుడు నామనంబు మర్త్యలోకమున నవతరించిన శ్రీకృష్ణపరమాత్ముని దర్శింప వేడుకపడుచున్న యది. అప్పుండరీకాక్షుండు కంసాది దుష్టశిక్షణంబును, శిష్ట రక్షణంబును గావింప సమకట్టి మానవుల భాగ్యంబునం జేసి ద్వారకాపురిని వేంచేసియున్నాఁడు. ఆ గోపాలచూడామణి దర్శనారాధనంబు లిహపర సుఖసాధనంబులు. బ్రహ్మాదు లొక్కయెడ వైకుంఠప్రభు నారాధించుచు 'స్వామీ! మీ నిర్గుణ స్వరూపంబు మాకుం జూడనలవిగాక యున్నది. కావున మా యీ నేత్రంబులచే సర్వదా దర్శింపఁ దగు, నీకళ్యాణ రూపంబుఁ బొడసూప ననుగ్రహింపుఁడ'ని వేఁడ వారిమనోరథ మీడేర్పనెంచి యాదయామయుండు దేవకీవసుదేవ తనూజుం డయ్యె. అమ్మహాత్ముండొనర్చుపనులు నరసుల దుస్సాధ్యం

బులు. ఆ పురుషోత్తముండు షోడశసహస్రాంగనా పరివృతుండై యష్టభార్యలం బరిగ్రహించి, వైభవంబున నిన్నుఁగూడ మించి లోకాభిరాముండై వర్తించుచున్నవాఁడు. ఆ శ్రీహరిని దర్శింప నేగుచున్నాఁడ'నన నిందుఁడు హరి తనను మించి యున్నవాఁడను మాట విననోపక యొండువిధంబుగా నిట్లనియె.

మహాత్మా! శ్రీకృష్ణుండు ధర్మసంస్థాపనార్థముగా నవతరించియు నియమప్రవర్తకుఁడు గాక, గోపికా సదనంబుల దధినవనీతంబులఁ దస్కరించి యెల్లయెడల స్త్రీలోలుండై ప్రవర్తించుట ధర్మవిరుద్ధంబుగాదె! అట్టివాని నెట్లు మహానుభావుండని సేవింపనగును. అని సురేంద్రుండు పలుక మునీంద్రుండు కినుక వొడమి తన మనంబున నిట్లు యోచింపఁ దొడఁగె. ఔరా యీతండు హరిమహిమం బెఱుంగక శ్రీకృష్ణు నధిక్షేపించుచుఁ దనకంటె నధికుండు లేఁడని గర్వించియున్నాఁడు. రాజ్యగర్వం బెంత పనినైనఁ జేయించునుగదా!

క॥ పరువంబు కలిమి దొరతన
మరయమియును నట్టి వీనియందొకఁడొకఁడే
పొరఁయించు ననర్థమునాఁ
బరఁగినచో నాల్గుచెప్పవలయునె చెపుఁడా.

ఉన్నతాధికారంబున నుండువారలుగరువంబుచే నెదుట నున్న దర్శనార్థులం గనరు. దీనజనుల మొరలు వినరు, ఆర్త జన ప్రార్థనలకుం బదులిడరు, ఎట్టివారినైనఁ జీమల దోమల

వలె నల్పులఁగాఁ జూచుచుందురు. దరినుండు వారెంత యుక్తి ముగా నుడువుచున్నను దాఁజెప్పినదియే యుక్తియుక్తమను కొందురు. తమ యూహాలోచనములే సమంజసములని యుగ్గడింతురు. ధనమదాంధతచేఁ బాపమనియైన నెంచక యొరులం దూలనాడుదురు. సామాన్యజనులతోఁ బల్కుట తమయౌన్నత్యమునకుఁ దగదని మాటలాడక యవసరమగుచో మూఁగవానివలెఁ గనుసైఁగఁ జేయుచుందురు. మదాంధులై కన్నుమిన్నెఱుఁగక యభాష్యభాషణంబుల నకార్యకరణంబులఁ గావింతురు. తన్ను లోకమునకు మహోపకారము చేసినవానిఁగా భావించుచు నుప్పొంగుచుందురు. తామే జ్ఞానవంతులమనియుఁ దమ శక్తిచే నున్నతపదవి నార్జించితిమనియు, నుబ్బుచుందురు. ఇట్టివారలెట్టి లోకాధినాథులగు నపుడు కాలోచిత బోధనా పద్ధతులతో వారికి జ్ఞానము గలిగించుట యుత్తమ ధర్మంబు. కావున నితని ప్రశ్నలకెల్లు సమాధానధానముఁ జెప్పెద'నని యోచించి 'మహేంద్రా! భగవల్లీల నెఱుఁగఁ జాలక నీవిట్లడుగుచున్నావు. కావునఁ జెప్పెదను వినుము.

## నారదుని జ్ఞానోపదేశము.

ఈశ్వరుఁడు విలాసార్థముగా లోకులను సృజించి వారల నుద్ధరించుటకై పలువిధములగు మార్గముల నేర్పఱచి యున్నాఁడు. అవియన్నియు వేదములయందు సాకల్యముగా నుడువఁబడి యున్నవి. వేదములా జగత్ప్రభుని శాసనంబులు. రాజా

నాజ్ఞాపద్ధతిని మీఱిన జనులవలె వేదోక్తపద్ధతుల మీఱిన వారును శిక్షింపఁ బడుదురు. తండ్రి కొమరుల శిక్షించుట వారిపురోభివృద్ధి కేయగునట్లు వేదవిరుద్ధప్రవర్తకులనాపదలపాలు సేయుట క్రమశిక్షచే వారికి జ్ఞానమొసంగి పరమ సుఖంబొసంగుటకే. పరమేశ్వరున కెవ్వరియందును ద్వేషభావంబులేదు. అతఁడు దయామయుండు. ఆజగదీశ్వరుండు లోకక్షేమమునకు నియమించిన మార్గములు దానధర్మములు, పరోపకారము, సత్కథాశ్రవణము, సత్ప్రవర్తనము, సత్కర్మాచరణము, యోగాభ్యాసము, మంత్రోపాసనము, దేవార్చనాదులు, జ్ఞానవిచారణము, దుర్వృత్తివైముఖ్యము. మొదలగునవి. ఇవియన్నియు నీశ్వరప్రాప్తిసాధనములే. వీనిలో నేమార్గమున వర్తించుచున్నను సర్వేశ్వరుఁడే లక్ష్యస్థానము అన్యచింతనలేక త్రికరణశుద్ధిగాఁ దననుభజించు వారికిఁ బరమపురుషుఁ డైహికాముష్మికము లొసంగును. ఎవఁడెట్టి యుద్దేశములతోఁ జిత్తమును హరిసమర్పణముచేసి తదేకనిష్ఠుఁడై యుండునో వానికా ప్రభువాయారూపముల వాంఛల నెఱవేర్చును. ఆగోపికలు గతజన్మంబున నట్లారాధించుటంజేసి పరమేశ్వరుండు శ్రీకృష్ణరూపంబున నిప్పుడు వారి కాంక్షితముల నటులొసంగు చున్నవాఁడు. గోపికలుగూడనితరంబుల మఱచి యెల్లవేళల శ్రీకృష్ణమయులై వర్తించుచున్నారు. గోపీగోపాలకులయెడ దోషారోపణసేయుట యజ్ఞానలక్షణము ఉత్తముల కుక్షిం జేరిన పదార్థంబులే పాపక్షయకరంబులై యుత్తమలోకప్రాప్తి సాధ

ప్రభావము.

వత్కుక్షిం జేరిన గోపీజనదధినవనీ
గారణంబులగునని వేఱ చెప్పనేల?
శ్రీకృష్ణునకు సమర్పించిన పిడికెఁడటుకులు కుచేలునికి మహదైశ్వర్య సంధాయకంబులగుట వినలేదే! కావునఁ గృష్ణపరమాత్మ గోపికలకు మనఃప్రియుండై, యజ్ఞకర్తలకు యజ్ఞపురుషుండై నిర్మలహృదయులకు భక్తిగమ్యుండై, యాశ్రితులకుఁ బ్రత్యక్షమంగళ స్వరూపుండై, శాత్రవులకుఁ బ్రళయకాల రుద్రుండై, నిగ్రహానుగ్రహంబుల కాస్థానంబై యున్నవాఁడు. ఇహపరసుఖములఁ గోరువారును శ్రీమన్నారాయణుని భజించుచుందురు.

క॥ ధీరులు నిరపేక్షులు నా
త్మారాములు నైనమునులు హరిభజనము ని
ష్కారణముగఁ గావింతురు
నారాయణుఁడట్టివాఁడు నవ్యచరిత్రా

—♦ గోపికలు కృష్ణపత్నులయిన విధము ♦

గోపీజనంబులు పూర్వజన్మంబునఁ గృష్ణునారాధించు టెట్లందువేని వినుము. మున్ను రావణాదిలోకకంటకుల వధింప శ్రీమన్నారాయణుండు శ్రీరామరూపంబున దశరథాత్మజుండై జనకవాక్యపరిపాలనార్థము సీతాలక్ష్మణ సమేతంబుగా విపినంబున కరిగి మునిజనతపోవిఘ్నకారులగు ముక్కుఁడిరక్కసుల

ప్రుక్కడంచుచు నాశ్రమవాసుల యోగక్షేమము లారయు చుండె. మునీంద్రులెల్లరు నొక్కయెడఁ దమ తపఃఫలరూపుం డగు సీతావల్లభుండరుదెంచెనని సంతసించి సీతారామలక్ష్మణుల దర్శింపనేగిరి. రాఘవుండును నెదురేగి సాష్టాంగదండములాచ రించి వారల దర్భాసనంబుల నుపవిష్టులంజేసి వారితో నుచిత భాషణంబుల సలుపుచుండె. అయ్యెడ మన్మథమన్మథాకారుండై వేయినోళ్లనైనఁ బొగడనలవిగాని కౌసల్యానందుని లావణ్య ప్రవాహమయంబగు సౌందర్యంబున కచ్చెరువడి ప్రేమాతిశ యంబుచే మునులారామభద్రు నాలింగనముచేసికొనఁగోరి తమకోరికం దెలిపిరి. దాశరథి యదివిని 'తాపసులారా! నేనీయ వతారంబున సీతామాత్రకళత్రుఁడను. ఈగాత్రంబు జానకికిం దప్ప నన్యులకాలింగనానర్హంబు. పరమభక్తాగ్రేసరులరగు మీ కోరిక నెఱవేర్చుట నాకువిధిగాన నేనిఁకముందు కృష్ణరూపం బున నవతరించెద. అపుడు మీకాంక్షితములు సఫలములగుఁ గాతమని యూనతిచ్చె. ఇప్పుడారామభద్రుండు శ్రీకృష్ణుండై జన్మించె. మునులెల్లరును గోపికాజనంబులుగను, భార్యలుగను జన్మించి హరికింబ్రియవల్లభలై చరించుచున్నవారు. ఏమివారి భాగ్యము! మున్ను పాదస్పర్శనంబుచే ఱాతిని నాతిగాసల్పిన జగన్నాథుని దేహస్పర్శనంబు గాంచుటకంటె మహాభాగ్యంబు గలదా! అని పలుకునారదునితో మాఱాడక జడనువడినపగిది విని యింద్రుండు సగర్వుండైయుండె.

అంతనారదుండు త్రిలోకేశ్వరా! నేనిఁకనరుగువాఁడనని

యచ్చోటువాసి చనుచుఁ దనమనంబున 'నోహో! మున్ను శ్రీకృష్ణుండు గోవర్ధనోద్ధరణంబుఁ గావించినతఱి నియ్యమరేంద్రుండు నిష్ఫలప్రయత్నుండై పరాభూతుండయ్యెను హరిమహిమను మఱచియున్నాఁడు. ఆహా రాజ్యమదోద్రేకం బనుభవించినదానిఁ గూడ మఱపించి జనుల సుప్తులం జేయునుగదా! కానిమ్ము మఱలఁ నీతఁ డా వాసుదేవుని భుజశక్తిచే ప్రబోధింపఁబడు గాత. దానికి నాకీతఁ డొసంగిన పారిజాతమే కారణము కాఁగలదు.' అని కృష్ణదర్శనోత్సుకుండై యేగుచుండె.

—♦ రుక్మిణీకృష్ణులయొక్క సారస్యం పెరుగుచుండుట. ♦—

ద్వారవతియందు వాసుదేవుఁడు వైదర్భితోఁ దన్మందిరంబున నాఁగటాలనాడుచు 'రుక్మిణీ! నిన్నీ పందెంబున ఓడింప జేసెదఁ జూడు' మని యోడి తానోడె. అప్పుడు భీష్మతనయ మందస్మితవదనారవిందయయ్యె. హరియచ్చెరువంది ముద్దుగుమ్మా! నన్నిప్రొద్దెల్ల నాటయందోటుపాలుచేసితివి. ఇది నీయాటకౌశలమునంగాదు. నీకు నాయందుఁగల పరిపూర్ణభక్తి నాకోటమిని గీటించినది. నేనెవరికి నోడువాఁడఁగాను గాని భక్తిశిఖామణులకోడుదును. అరవిందమరందమును మిళిందంబుచందంబున నా సారము నంతయు భక్తజనంబు లాకర్షించుచున్నారు. ఏను భక్తికివశుండనైనట్లు మఱేదేనికిని వశుండఁగాను. శ్రుత్యనుకూలములగు వీణాతంత్రులు నాదమున బరస్పరభేదముగలిగియున్నను గలిపి మీటినప్పుడేకనాదముతోనున్నట్లు పరస్పరభేదముగల మనోవాక్కాయకర్మములు మిళితంబుగాఁ జేసి భజించినచో నేకా

కారమగుభక్తియగును. అట్టిభక్తిచే నాగస్వరముమూలమున సర్పంబుపగిది నేనువశుండనగుదును. నన్ను స్వాధీనపఱచుకొన్న నీవెల్లవిధముల ధన్యురాలవు. అనిపలుకు హరివచనంబుల కానందించుచు రుక్మిణి మి న్నువంకఁ జూచి 'హృదయేశ్వరా! ఎక్కడిదియోయింటదివ్యనాదంబువినవచ్చుచున్నదియనఁగృష్ణుఁడు దివ్యచిత్తంబుననవధరించి 'దేవి యది నారదముని వీణానాదము. అత్తాపసుం డస్మద్దర్శనార్థియై వచ్చుచున్నవాఁడు. ఆతని గౌరవించుటకేను గొలువుకూటంబునకేగెద! నీవిందుండు'మని తాను సభాస్థానంబునకేతెంచె.

నారదుండు హరిచరితంబుఁ బాడుచు భక్తిపారవశ్యంబున శిఖముడివీడఁ, దాళధ్వని శ్రుతులకింపునింప, మహతియను వీణంగరంబుననూని యాకసంబునుండి చంద్రుఁడరుదెంచెడినోయన నవనికవతరించె. పౌరులుకొందఱిమ్మహాత్ముం డిటకేతెంచె నేడేవియేనివింతలుపుట్టకమానవని యాతనింగని యనుకొనుచుండిరి. మఱికొందఱత్తాపసోత్తముం గాంచిన ధన్యులమగుదుమని వందనములొసర్ప నేతెంచుచుండిరి. కొందఱిమ్ముని యుత్తమధర్మము లుపన్యసించునని విననెంచి కూడ నేగుచుండిరి. ఆమునిచంద్రుండు వెల్లివిరియు నాపురలక్ష్మిసౌందర్యంబున కచ్చెరువందుచు శ్రీహరియాస్థానంబు దరియవచ్చె. వారిజనాభుండదివిని మౌనికెదురేగి సభక్తికంబుగా సాష్టాంగ వందనములాచరించి సురలు తన్నుఁబూజించునట్లు మునింగౌరవించి కనకాసనాసీనుంజేసి కుశలప్రశ్నంబుల నాదరించి యిట్ల

నియె. "సంయమీంద్రా! తమరుత్రిలోకసంచారులు. తమ దర్శనంబు సుకృత సంపాదనమునకును దుష్కృతవ్యాపాదమునకు, మూలంబై సర్వశ్రేయంబులొసంగఁజాలు.యుష్మద్దర్శనంబున నేఁగృతార్థుండనైతి. తమరిపుడేలోకంబును బవిత్రముచేసి దయచేయుచున్నారో యందలివిశేషకథనంబులచే వీనుల నానందింపఁజేయ వేఁడుచున్నవాఁడ" ననమునీంద్రుండు "కృష్ణా! నీకుఁదెలియనిదేముండును. ధర్మపద్ధతినడపుటకై నన్నిట్లుగ్గడించెదవుగాని నేనునీకుస్తోత్రపాత్రుండనే? దేవకీనందనా!నీవుజన్మాదులు లేనివాఁడవయ్యుదివ్యావతారంబుఁలదాల్చుట,సర్వవ్యాపకుఁడవయ్యు ద్వారకానివాసివగుట, సర్వసముఁడవయ్యు నాశ్రితపక్షపాతివగుట, యిత్యాదులెల్ల నీకుసహజంబులుగదా! భక్తులవాంఛలందీర్ప యశోదానందనుండవైతివిగాని నీవుపరమాత్మరూపుండవుగావే!

ఉ॥ నీవుయశోదబిడ్డఁడవై నీరజనేత్ర ♦ సమస్తజంతుచే
తోవిదితాత్మ వీశుఁడవు తొల్లి విరించి ♦ దలంచిలోకర
క్షావిధ మాచరింపుమని సన్నుతిసేయఁగ♦సత్కులంబునన్
భూవలయంబునందు నిటుపుట్టితిగాదె ♦ మనోహరాకృతిన్

ఉ॥ కారణకారణుండవు వికారవిదూరుఁడ వాగమాద్యలం
కారుఁడ వింద్రియాద్యఖిలకారణవస్తుగణప్రవర్తనా
ధారుఁడ వద్వితీయపరతత్వసుఖానుభవుండవైన ని
న్నేరికిశక్యమాఁబొగడ నీశ్వర! సాధుమనోబ్జభాస్కరా?

## శ్రీకృష్ణుని మహిమను నారదుఁడుపొగడుట.

దేవా! యే నెప్పుడును బాపాటవీకుఠారంబై, యజ్ఞాన ధ్వాంతచండభాస్కరంబై సర్వకాంక్షాప్రదానకల్పకంబై స్వర్గాపవర్గసాధనంబగు భవన్నామ పారాయణం బొనర్చుచుందును. లోకులకు ధర్మంబుల నుపన్యసించుచు సర్వలోకంబులఁ బరిభ్రమించుచుందు. తమ రనుగ్రహించి గౌరవించుచుండుటం జేసి బ్రహ్మర్షులెల్ల నన్ను బ్రహ్మవిదునిగాఁ బొగడుచుందురు. దానం జేసి భవన్మహిమను సంపూర్ణముగా నెఱింగినవాఁడనను గర్వంబు నామనంబునఁ బొడకొనియుండెడిది. అట్టి యపరాధంబు కించిత్కాలము క్రిందటఁదొలంగి గర్వంబడంగినది. ఎట్లందురేని దివ్యచిత్తంబున నవధరింపుఁడు. ఒక్కయెడ నేను రుక్మిణీమందిరంబునఁ దమదర్శనంబొనర్చి తమచే సంభావితుండనై సత్యభామాసదనంబున కరిగితిని. తమ రచట సత్యతోఁ బ్రియాలాపంబులాడుచుంటిరి; దానింజూచి యిప్పుడు రుక్మిణీమణిమందిరంబుననున్న స్వామి యిక్కడికెప్పుడు వచ్చెనాయని యబ్బురపడి యంత మిత్రవిందాసదనంబునకరిగితిని. అందుఁదమరు జగన్మోహనాకారముతోఁ దేజరిల్లుచు సేవింపఁబడుచు భర్మడోలికనూఁగుచుంటిరి. హరి యిక్కడికి మఱల నెప్పుడువచ్చెనోయని విస్మయంబంది రాధామణి ప్రాసాదంబునకు వచ్చితిని. అందుఁదమరా రాధతో భక్తివిశేషంబుల నుగ్గడించుచు నామెచేఁ బరిచరింపఁబడుచుంటిరి. అందుల కాశ్చర్యమొదవ నద్దపు నిలుచేరితి. అమ్మద్దపునకు యోగవి

ద్వ్యైరహస్యంబులను, మఱికొందఱుభక్తులకు జ్ఞానోపన్యాసములను మఱికొందఱకు సదాచారసత్ప్రవర్తనాది విషయంబులను బోధించుచుంటిరి. అక్కడజరిగినవర్తనంబులు మిక్కుటంబగు నక్కజంబు నెక్కొనంజేయఁ దమ గుట్టెఱుంగవలయునని పదియాఱువేలచేడియలమేడలను, గోపాలకాలయములబరీక్షింప, నొక్కచోఁగేళీవిలాసంబులు, నొక్కచోమురళీగానము,నొక్కయెడధర్మోపన్యాసంబు, నొక్కపట్టుననెక్కసక్కియంబులుఁ గావించుచు ననేకవేషంబులఁ జిత్రవిచిత్రవినోదంబులఁ బ్రవర్తించుచుంటిరి. తాములేనినిలయంబును తమరు సలుపనిచనుత్కారచర్యలను గానక, సర్వాంతర్యామివి మహాప్రభావసంపన్నుండవు నని యెఱింగి నీమూలంబు బ్రహ్మాదులకైనఁ దెలియనలవి గాదని నిశ్చయించి సామానోగర్వంబుంబరిత్యజించి భవన్నామపరాయణం బేషఱకసలుపుచుంటిని. వాసుదేవా! నాయపరాధంబుక్షమింపుము. నీమహిమం బెవఁడెఱుంగనోపు? నీనామస్మరణంబులేనిక్షణంబు నాకుమహాయుగంబుగాఁదోఁచు. పరమపురుషా! యేనింతకుమున్నింద్రలోకంబునకువచ్చి యింద్రునితో మాటాడునెడ నావిభుండీపారిజాత కుసుమంబును నాకొసంగె. దీనిందమకు సమర్పింపనెంచి తెచ్చినాఁడ. వినయవంతునికడనున్నవిద్యవలె నీకుసుమరాజంబు తమబోంట్లకడనున్నఁగదా కడుంగడుఁబ్రకాశించుచుండు. దయచేసి దీనిం గైకొనుఁడు. అని నుడివి తనయొద్దబదిలంబుచేసియుంచిన యావిరినిహరికొసంగె. కృష్ణుండు మహాప్రసాదంబని దానిం గైకొని నమస్కరించి

మునీంద్రా! యమరలోకంబునఁ దమకును, మహేంద్రునకును జరిగినసంగతియు, మీామనోభావంబులును నాకుఁదెలిసియే యున్నవి. నీయుద్దేశమున కెప్పుడును వేఱుగానోపదు. త్వరగా ఫలించెడిని. అనిమధురాలాపంబులాడుచు నారదునివీడ్కొలిపి తనమనంబున నిట్లుయోచించె.

## —♦ కృష్ణుని యాలోచనము. ♦—

ఇయ్యదియనర్ఘ్యకుసుమంబు. దీనినితరపత్నులకొసంగిన రుక్మిణిమనంబు చిన్నవోవునేమో? రుక్మిణికేయొసఁగుదునా సత్యకుం దెలియకుండదు. ఆమెస్వభావముచేతనే పట్టుదలగల దిట్టగాన నలుకవహించి పంతంబులాడకమానదు. సత్యకే యిచ్చెదంబో తదితరభార్యలుమాత్ర మట్టివారలుకారా? ఏనెందఱితోఁబంతంబులాడఁగలవాఁడ. ఆడుదుంబో యట్లుసేయుట ధర్మమా? అందువలనిప్రయోజనంబేమి? బహుపత్నీకునిబ్రతుకెప్పుడును భయంబులపాలగుచుండును. బహుభార్యావంతుఁడు కార్యాకార్యంబులం గడుజాగరూకుండయిమెలంగఁజాలఁడేని గౌరవజీవనంబుసేయంజాలఁడు. మర్యాదావంతుడుగానివానిబ్రతుకు కాల్పనే? ఇప్పుడీవిషయమున బహుయుక్తియుక్తముగాఁ బ్రవర్తింపఁదగియున్నది. కావుననీయుపాయంబు తగియున్నది. ఎట్లన ఇతరభార్యలకుఁబొడమినయలుకను ప్రేమదానాదులచే నివారింపఁదగును. సత్యభామాకోపంబు ప్రియోక్తులచేనుపశమింపకున్నచో సురతరువుందెచ్చి యీయందగును. దానంజేసినారదునికోర్కెయుసఫలంబగును భర్తురాలయ్యు నధికప్రే

నూన్నవురాలననుకొను సత్యగర్వమిప్పటికడంచుట యే యు క్తము. భార్యకుంగలిగినగర్వ మెప్పటికప్పుడడంచుచు వశు రాలిఁగాఁచేసికొనఁజాలఁడేని పురుషుండు తనఖ్యాతింగోల్పో వును. కార్యసమర్థుండుకానివాఁడు బహుపత్నీకుండగుట తన్నుఁ గట్టఁద్రాళ్లు తాఁదెచ్చుకొనుటయే.

సత్యభామ పరమభక్తురాలనుటకు సందియంబులేదు హృదయంబున నన్నెప్పుడుమఱచునదియుఁగాదు. కాని కులశీ లంబుల నధికురాలననుకొనుచు వేషభాషలయందుఁ వేడ్కగలిగి కమ(బాగల్యవృత్తితో వర్తించుచుండును. శుద్ధసత్త్వవంతు రాలుగాదు రుక్మిణియన్ననో ప్రాపంచికవృత్తులయందు లేశ మైననిచ్ఛగొనక పరమశాంతనిధియై యంతరంగబహిరంగంబు లంగూడఁ జందురునివెన్నెలవలె నెప్పుడును నన్నెడబాయక నాస్వరూపముతోనుండును. కావునసత్యకంటె రుక్మిణి యుత్త మోత్తమురాలనుటకు సందియములేదు. ఇపుడిట్టిబహుమానం బునకీమెయేతగు. ఇట్లుసేయుట సర్వకార్యానుకూలమగు అని తలంచి రుక్మిణీ! నారదుండొసంగినయీదేవకుసుమంబును నీకొ సంగితి ధరింపుము. అనియామెకొప్పున నద్దానినలంకరించె. ఆ పుష్పధారణంబునంజేసి యాయువిదసౌందర్య మింతింతయని తె లుపనలవి గాకుండె.

నారదుండెట్టిపట్టుననైన నిరభ్యంతరముగా వర్తించు వాఁడుగాన నపుడారుక్మిణీగృహాభ్యంతరమునకరుదెంచె. రుక్మిణి లేచి సభక్తికంబుగాసపర్యలంగావించి యామ్మునికిఁ గనకపీఠం

బోసంగె. మునియందుపవిష్టుండై 'అమ్మా! రుక్మిణీ! నీవుసాక్షా
ల్లక్ష్మివి. నీదివ్యావతారంబులులోకపవిత్రంబులు. భగవంతుం
డగువాసుదేవునకు నీయందుఁగలయనురాగము వర్ణనాతీతము.
అష్టభార్యలలో నేరికినొసంగక నీకిడినయీపారిజాతప్రసూనమే
హరికినీపైఁగలభక్తవాత్సల్యమును బ్రకటించుచున్నది. నీకు
స్వామియెడఁగలభక్తివిశేషమున కిదితగినబహుమానము. దీని
మహిమనాలకింపుము. ఇదిమానవలోకవాసులకుదుర్లభంబు.
ఈప్రసూనమునుధరించుటంజేసి శచీదేవివైన నీకునాటిగానోప
ము. గౌరీసరస్వతులుగూడ నీభాగ్యంబున కచ్చెరువొందుదురు.
ఇయ్యదినీచెంగటనున్నచో నుష్ణకాలంబులశీతంబును, శీతకాలం
బులనుష్ణంబును గలిగించుచుఁబరమసుఖాపాదియగును. దీనిపరి
మళముచెడదు. ఈకుసుమమెప్పటికినివాడదు ఇదిపరమసౌంద
ర్యదాయకంబై సకలకాంక్షితములొసంగుచుండును. ఈపుష్ప
రాజంబును నీకేశపాశంబునఁదాల్చుటంజేసి సవతులెల్లరు నీ
గోటికిని సాటిగానేరరు. ఇంకనుదీనియందనేకమహిమలుగలవు.

ఉ॥ చక్కనిదాననంచు, నెలజవ్వనినంచు, జగంబులోనఁజే
రెక్కినదాననంచు, బతియెంతయునాకనురక్తుఁడంచుఁదా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదుకాంతలసత్య, యింతకున్
స్రుక్కకయున్నె నీమహిమసూచిన, బోటులువిన్నవించినన్

కం॥ ధరియించినమొక లాకవ
త్సరమాత్రముదావకీనధమ్మిల్లములో

నిరవధికానిమగుడనివ్వీరి
తరుణిరో యలపారిజాతతరువునకరుగుస్.

ఇట్లనేకవిధంబులఁ బుష్పమహిమంబునుగ్గడించి, రుక్మిణిని వినుతించి, యామెచే సంభావితుండై నారదుండు వీడ్కొనియె.

సత్యభామ పరితాపము.

ఎండచల్లబడినది. రెండుమూఁడుగడియలప్రొద్దున్నదిఁ. పూఁపొదలందలి పైఁబై వీతెంచుకమ్మతెమ్మెరలు ప్రాణులకుసంతసమ్మొసఁగుచుండె. తుమ్మెదలఝుంకారమ్ములు మృదంగధ్వానములుగాఁ, గలకంఠనాదమ్ములు గానమ్ములుగాఁ, బవనచలితకిసలయాంగుళులచేనభినయించుచున్నవనలతావధూటికలనర్తనంబులు చూపఱులకానందమొసఁగుచుండె. అపుడు సత్యాసౌధమందలి కీరశారికాదులకలకలాలాపంబు హరిభజనంబుకైవడిఁ గన్పట్టుచుండె. చామరములువీచు చెలికత్తియలకరకంకణారవంబులు హరినామస్మరణంబుసేయుమని సత్యకుఁ దెలుపుచున్నవోయన నొప్పుచుండె. అయ్యెడ సత్యభామ హరిపై భక్తిదొరల కృష్ణుఁడురాకుండుటంజేసి మనోరథపరంపరలుప్పతిల్ల స్వామిరాకకెదురుచూచుచు నిట్లుపరితపింపఁదొడఁగె.

కృష్ణా! మఱలవేగవత్తునని యోగి యింతదనుక రాకున్న నీదాసురాలెట్లోర్వగలదు. చంద్రదర్శనములేని చకోరికకరణి, జలదాగమనంబులేకయున్నఁ జాతకాంగనకైవడి, భవద్దర్శనంబులేక యేనెట్లుజీవింపనేర్తు ? సూర్యకిరణప్రసాదములేని నళినివడువున నాబుద్ధి వికాసహీనమగుచున్నది. నినుఁగాంచ

కుండుటచే నాకులోకమంధకారమయమైనది. తృటి మహాయుగముగానున్నది. నాకెపుడుదర్శనభాగ్యము సంఘటింతువు ? నీయిందీవర సుందరాంగంబు నెపుడుకనుగొందును ! గండుతుమ్మెదలతళుకు బెడుదవడఁజేయు నీనెఱికురులను బొండుమల్లియలతో నెపుడలంకరించుదాన! మహాయోగిజన ధ్యేయములై శంఖచక్రాదిరేఖాంకితములై చెలువొందు నీచరణారవిందముల నరవిందములతో నెపుడుపూజించుదాన! దేవకీనందనా! పరిపూర్ణచంద్రబింబముంబలె నాహ్లాదకరంబగు నీముఖమండలమును దర్శించునపుడు దృష్టిదోషము తగులునోయని కనులారవీక్షింపకుందునుగదా! 'భామా! నాకునీయందుగలయనురాగమేచానలయందును లేదని వచియించునీప్రేమ యిపుడెందుఁబోయె! "సత్యా! నీవునాకుబహిఃప్రాణమవు.నీవుతలఁచినపుడెల్ల నీచెంగటనుండువాఁడననిపలికిన నీప్రమాణవచనంబులేమయ్యె! కృష్ణా! ననుమఱచితివా! నాయొనర్చుభక్తి నీమది కెక్కకుండెనా! నాసవతులుపన్నెడి మాయావాగురంజిక్కితివా! వారి మరులుమందులునిన్ను వశునింజేసెనా! నేనేమిసేయుదాన కటాక్షింపుము! వైళంబ దర్శనంబిచ్చినీచరణసేవాభాగ్యము నాకుం బ్రసాదింపుము! నీదర్శనంబులేని నాజన్మంబేల? నాసౌందర్యంబేల? నీకు దాస్యంబు సలుపనిచో నాయవయవంబులు నిష్ప్రయోజనంబులు. అన్నియునిష్ప్రయోజనంబులు.

సీ॥ కంజాక్షునకుఁగాని ♦ కాయంబుకాయమే
పవనగుంభితచర్మ ♦ భస్త్రిగాక

వైకుంఠుఁబొగడని ♦ వక్త్రంబువక్త్రమే
ఢమఢమధ్వనితోడ ♦ ఢక్కగాక
హరిపూజనములేని ♦ హస్తంబుహస్తమే
తరుశాఖనిర్మిత ♦ దర్విగాక
కమలేశుఁజూడని ♦ కన్నులు కన్నులే
తనుకుడ్యజాల ♦ రంధ్రములుగాక
చక్రిచింతలేని ♦ జన్మంబుజన్మమే
తరళసలిల బు ♦ ద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని వి ♦ బుధుఁడు విబుధుఁడే
పాదయుగముతోడి ♦ పశువుగాక.

ఇట్లుచింతించుచుసాత్రాజితి చిత్తంబునుహరిపరాయత్తంబు జేసి ధ్యానపరవశయైయున్నయెడ నంతకుమున్ను కృష్ణునిం బిలువనేగివచ్చినచెలికత్తియ సత్యభామంజేరి 'అమ్మా భామారత్నమా! నేను హరినింబిలువఁబోయి యిదెవచ్చుచున్నదాన. నేఁడొకవింతపుట్టినది శ్రీనారదమునీంద్రుఁడు స్వామినిదర్శింప వచ్చి యొకదేవలోకకుసుమంబునిచ్చిన హరి దానింగైకొని రుక్మిణికిచ్చెనఁట. ముని యావిరిమహిమంబునుడువుచు రుక్మిణిం బొగడునెడ "దీనిఁదాల్చినచో సత్యభామాదులు నీకుసాటి రానోపరు. కృష్ణుండుగూడ నీకువశవర్తియయ్యెడు" నని రుక్మిణితోఁబలికెనఁట. స్వామివారిప్పుడు రుక్మిణితో ముచ్చటలాడుచు సంతోషపరవశుఁడైయున్నవాఁడు. నేఁడిక్కడికివచ్చునట్లుతోఁపకున్నది. అనియిట్లుచెలిపలికినపలుకులు తనచెవులకుములుకులు

గానాటఁ, దోఁకత్రొక్కిననీలభుజంగసుందరి తెఱంగున, నెండ సోఁక మండుమార్తాండమణి కైవడి, నేయివోయ భగ్గునదరికొన్నవీతిహోత్రజ్వాలపోలిక, నగ్గరితదిగ్గునలేచి యలోపంబగు కోపంబున శ్రుతికుండలమండితగండభాగయై నెచ్చెలితో నిట్లనియె.

సఖీ! యేమేమి! ఏమియీవింత! ఎన్నఁడునువినని మాటల నేఁడుగదావింటి. ఎట్లెట్లు! నారదుండువిరిదెచ్చిహరికిచ్చెనా? దానినిగృష్ణుండురుక్మిణికిచ్చెనుగా! నారదుండంతనిలువక నన్నుందిరస్కరించుచు రుక్మిణినిమెచ్చెగా! పూవునురుక్మిణికిచ్చిన నిచ్చెఁగాక; నామాటయేలరావలయును! దాఁపక చెప్పుము. ఇంకేమిజరిగినది. ఆహా! ఇట్టికాలంబున కిట్టిమాటల శ్రవణంబులవినంగవలసివచ్చె. ఇంకనిమ్మేనం బ్రాణంబులనెట్లు దాల్చెద! తొలిజన్మంబున నింతగానోములనోఁచితింగాఁబోలు! ఇంకనిమ్మహీతలంబున నెట్టివిపరీతముల వినం గనుంగొన నున్నదాననోగదా! కుందరదా! నారదుండు రుక్మిణినగ్గించి, ననుం దూలనాడునెడఁ గృష్ణుండప్పలుకులువినియెనా? కృష్ణుండప్పలుకులకు బదులైనఁజెప్పఁడుగా! నాసవతిమాయలు నాస్వామినంతకుఁదెచ్చెఁగాఁబోలు! ఏమిసేయుదాన! ఇఁకనాకేమిత్రోవ! సవతియెదుట సవమానింపబడు సుదతిబ్రతుకు గాల్పనే! మగఁడూరకున్న నెవ్వరైన, నేమాటనైన నందురుగదా! **విభుఁడు** నాపైఁబ్రేమ మఱచెంగాఁబోలు.

సీ॥ కలలోనైననవ్వులకైననామాట
జవదాటవెఱచునో చంద్రవదన
యేఁదారంబునాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారికొసఁగఁడోయిగుగుబోఁడి
చెలులునాతోనేమి చెప్పౌదురోయని
లంచంబులిచ్చునో చంచలాక్షి
తోడిచేడియలు నాతోడివంతులకురా
సయిరింపఁజాలఁడో సన్నుతాంగి

తే॥ యఱమరలులేని కూరిమినన్గి పెనఁగి
కొదలుదీఱని కోర్కులఁ గూడిమాడి
కపటమెఱుఁగని మమతలఁ గలసిమెలసి
యున్నవిభుఁడిట్లు సేయునే యోలతాంగి!

కం॥ కలకాలమొక్కగతిఁబా
సలలోదారంబుమాడ్కి సతిమదిలోనఁ
మెలఁగెడిపురుషులుగలుగుట
తొలిజన్మమునోముఫలము తోయజనేత్రా!

—♦ సత్యభామ కృష్ణునిపైఁగోప్ప మూనుట. ♦—

ఇంతకును గృష్ణుఁడే మూలము.శ్రీహరికి నాయెడనిక్క
మగుప్రేమయున్న నాకిట్టియవమానమగునా? ఆకుహా నాగోపా
లుని నమ్ముటచే నాస్థితినాతఁడిపుడింతకుఁదెచ్చె. కానిమ్ము. నా
ప్రాణేశ్వరుండెట్టులైన నిక్కడికిరాకమానఁడు. ఎట్టులైనను నా
విభునివశునింజేసినాకార్యంబుసాధింతుఁగాక.అందుననొకయుపా

యంబుఁబన్నవలయునని యోచించి స్నానపానంబుల వర్జించి, మేని భూషణంబులఁ బరిత్యజించి, కడుమాసినచీరె ధరించి, వియోగిని కైవడి, కుసుమంబులూడ్చిన వల్లికపోల్కి, రాహుగ్రస్తయగు చంద్రికళమాడ్కి, మేఘమండలముచేఁ గప్పఁబడిన పున్నమ వెన్నెలవడువునఁ గళావిహీనయై నక్షత్రమువలె మిణుకుమిణుకునఁ గనుపట్టు దీపకళికచేఁ జెన్నుతరిగిన కోపగృహంబున నొక శిథిలపర్యంకంబున శయనించి పరితప్తహృదయయై యుండె.

అంతసత్యాకాంత శాంతంబుకరణి నరుణ కిరణుండస్తంగతుండుగాఁ, సత్యాకృష్ణులకుం జరుగఁబోవు కలహారవంబులవలె ఖగకులకలకలనినదంబులు చెలరేఁగ, సత్యకుమారి పైఁగల క్రోధరసంబు మాడ్కి సాంధ్యరాగంబు పర్వ, సురలోకతరువును దేఁగలండని హరియశంబును మున్నందు చాటుచుండెనోయన సుధాంశుండు నిర్మలచంద్రికల దిశల వెదచల్లుచుండె.

కృష్ణుఁడు సత్యభామాగృహంబునకు వచ్చుట.

అట్టియెడ సత్యభామావల్లభుండు సాత్రాజితీసదనంబునకేగ సమకట్టి ఘుమఘుమపరిమళమిళితంబగు కప్పురపుగందంబు మేనంబుగుల్కొన, నిగనిగ మెఱయు సిగను సొగసగువిరుల సరులుపురడింపఁ, దళుకుదళుకున మెఱయు మొగంబునఁ దీరుగా దిద్దినగీఱునామంబు తేజరిల్ల, సందంబుజిలుగు దువ్వలువందాల్చి, పట్టుపుట్టంబును నీటుగా వల్లెవాటుమర్చి, మన్మథమన్మథుండోయన జగన్మోహనుండై సైన్యమేఘపుష్ప సుగ్రీవవలాహకంబులను తురంగంబులఁ గట్టిన యరదంబెక్కి సత్యాప్రాసాదంబు

దరియవచ్చె. నాఁడక్కడికిఁ గృష్ణున కెదురువచ్చినవారే లేరు. కైదండనొసంగెడువారు కానరారు. కపటగోపకుండది చూచి కారణంబెఱింగి, దారుకుని కైదండచే రథావరోహణంబొనర్చి లోలోన నవ్వుకొనుచుఁ దెఱచియుంచఁబడిన ద్వారముఁబ్రవేశించి, దారకునందునిలిపి లోపలి కేగుచుండె.

చూచితిరా! వివేకవతియయ్యుఁ గడుభక్తురాలయ్యును సత్యయెట్టిపనియొనర్చినది? సాధారణముగా లల్లోఁబలుపుర కిట్టిపట్టుదలయుండుట నైసర్గికము. అట్టివారితో మెలంగుటపురుషులకుఁ గడుదుర్లభముగదా !

సర్వజ్ఞుఁడగు దామోదరుండు తెలియనివానివలె నటించుచు, సత్యకై యాయాగదినీక్షించుచు, 'ఎందునుభామామణి జాడఁదెలుపువారులేరు, ఇదేమియో'యని సత్యకైపరితపించుచున్నట్లు వెదకుచుండె. సత్యచేనియమింపబడినచేడియలురహస్యంబుగా నిందందునిలచి కృష్ణచర్యలంగనుచుండిరి. కృష్ణుండారాయిదియేమి' 'నాభామామణి,నాబహిఃప్రాణము, నాప్రాణేశ్వరి. యెందరిగినది! ఏమి యుపద్రవమువచ్చెనో! ఎల్లొకొయిందెవ్వరునుగానరారు. ప్రతిదినము నారాకదెలుపురాచిలుకయు నేడిందుఁగానరాదు. నేఁడేమొకో యిల్లెల్ల జిన్నవోయినది నాకేమియుఁదోఁచకున్నయది. ఏమిసేయువాఁడ. అనుచువెదకుచుఁ, బిలుచుచుఁ, జెలికత్తియలంజీరుచుఁ, దుదకు సత్యయుండు చోటికింజనియె.

ఏమియీయాయదువల్లభుని కార్యనైపుణ్యము! పదియాఱు వేవురుసుదతులతో మెలంగుచాతుర్యము నాధీరుండెఱుంగుఁ గాని యన్యులకదిసాధ్యమా! దానినెవరువ్రాయనేర్తురు? పాము కాళ్ళు పామెయెఱుంగునట్లు సర్వచాతుర్య ధుర్యయగు నాసత్య జాణతనంబు నాగోపాలచూడామణియె యెఱుంగును. వింతగాఁడగు నాయదుకాంతుం డాయింతిచెంతఁ జేరెను. దీప కాంతిని హెచ్చించెను. భామామణీయనిపిలిచెను గాని భామ మాటాడక ముసుంగిడుకొని యుండెను. కృష్ణుండు చెంతనుండు పరముపైఁ గూర్చుండెను. మఱల భామాభామాయని పిల చెను. బదులులేదు, కృష్ణుఁడు ప్రేయసీ! పరుంటివేలయనిముసు గుదివిచెను గాని యామెమఱలంగప్పుకొనియెను. కృష్ణుఁడు ముసుఁగుదివిచి కరంబున మోమునిమురుచు సుందరీ! నీమోము నేఁడుచిన్నవోయియున్నది. ఏలయో చెప్పుము.

—◆ సత్యభామ ప్రణయ కలహము ◆—

సత్య—నామొగమేలచిన్నవోవును. చిన్నవోవువానిమొగమే చిన్నవోవును.

కృష్ణ—అన్నులమిన్నా! నీబంగరుమేన నగలులేకున్నవి. తీసితి వేల?

సత్య—ఈనగలన్నియు మోయఁజాలక తీసితిని.

కృష్ణ—నీకీయాభరణములు చాలకున్నవని కాఁబోలు నిట్లనుచు న్నావు. మఱికొన్ని యొసంగుదునా?

సత్య — చాలకేమి! వెలలేనినగను చేయించియిచ్చితిరి. తమ రెన్నియైన నీయ సమర్థులుకదా!

కృష్ణు — మెడలోకి మఱికొన్ని రత్నహారములు చేయింతునా?

సత్య — నాకు వేసిన యీహారము చాలును; చేయింపవలసిన వారికిఁ జేయింపుఁడు.

కృష్ణు — ఇట్లనియెదవేల? నాకునీకంటెఁ బ్రేమాస్పదురాండ్రెవ రున్నారు?

సత్య — అవును. తమకు నాకంటెఁ బ్రేమాస్పదురాండ్రు లేరు; సత్యమే పలుకుచున్నారు.

కృష్ణు — అసత్యమనుకొంటివా యేమి? జలంబునరసమువలె, భూమియందు గంధంబువలె, కుసుమంబునందావివలె, నీయందు నాకవిచ్ఛిన్నమగు ప్రేమయుండుట సత్యము.

సత్య:—తమరసత్యమే యెఱుఁగరు. శుష్కప్రియంబులు, శూన్యహస్తంబులు, పలుపోకలమాయలు, నయగారపుమాటలు గోకర్ణగజకర్ణవిద్యలు, తమయెడఁదమరు పుట్టుకమున్నే పుట్టినవి. ఇదియెఱుంగక నాగుట్టు రట్టడి చేసికోల్పోతి. నీకచాలులెండు.

కృ:—చిలుకలకొలికీ! అసరసత్వ మెన్నఁడునెఱుంగని నీవు నేఁడిట్లు విరసోక్తులాడనేల?

సత్య:—గోపాలకులతోఁ జెవిమిసేయు తమసరసత్వము నాఁ బోటి బోఁటికెట్లలవడును ?

కృ:—శరదిందువదనా! యేల యోనీకునా పైధృతముగాఁగోపము

గలిగినది. నీకెవరేమియెగ్గు గావించిరో తెలుపుము శిక్షించెదను

సత్య:-తమ రెవరినైనను శిక్షింపఁగలరు. శిక్షింపఁగలవారే యెగ్గుచేసినచో వారిని శిక్షించువారెవరు?

కృ--ముద్దులగుమ్మా! నేనే యెగ్గుచేసితినంటివి; అందఱికంటె నిన్నుఁబెద్దజేసి యెక్కువ చనువులిచ్చి నందుకా నిన్ని టనుచున్నావు; స్త్రీలెట్టివారినైనఁ జుల్కనసేతురుగదా?

సత్య:_తమర ట్లేయనుకొనుడు. దేవకీదేవినందనకోడండ్రలో నెల్లపెద్దచేసి చనవిచ్చె. దానంజేసి నిన్నునమ్మి మోస పోతిని. పురుషులనమ్మిక మేడిపండుగదా ?

కృ:-భామామణీ ! నేనిన్ను మోసగింపనెంచువాఁడనేని పరభ్ర వ్యాపహారియనుభవించుపాపమనుభవించువాడనగుదును.

సత్య:_అవును, పాపము తమరేపాపము నెఱుఁగరు. గోపికల పాల్వెరుగులను గుండలే త్రాగెంగాఁబోలు!

కృష్ణ—సతీ! బాల్యచర్యలంబట్టి నన్నుదూషింపనగునే? నేను గోగోపికాదుల కెన్నియోబాధలంబాపితిని. ఆశ్రితుల కెన్నియో యుపకారంబుల సలిసితిని. వాని నెన్నఁ దగదా ?

సత్య—సత్యమే. తమరిష్టులగువారి కెన్నియేని గూర్తురు; నేనే కదా తమకన్యురాలను.

కృష్ణ—సఖీ! యీవాదమేల? నీప్రియాలాపములచే నన్నాద రింపుము.

సత్య——స్వామీ! తమబహిఃప్రాణమగు నారుక్మిణీ ప్రియాలాప ముల వినిన వీనులకు మాచవిగాని మాటలురుచింపవు. అక్కడికే యరుగుఁడు.

కృష్ణ——నీకంటె నాకారుక్మిణియెట్లు ప్రియురాలు?

సత్య——ఎటులనో లెండు. పిల్లికనులుమూసి పాలుద్రావిన యొరులెఱుఁగరు గాబోలు; మీమేనినుండి వీతెంచు వాసన నాకోర్వరాక యున్నది. అక్కడికే దయ సేయుఁడు.

కృష్ణ——ఓహో! ఇదియా! భామా! నారదుఁడిచ్చిన విరి నా మెకిచ్చితిననియా యింత వగరుచున్నావు. అప్పు డామె చెంగటనుంటచే నట్లీవలసె. మిగిలినదానికి నే నేమి చేసెదను. నీవేమి చేయఁగలవు. గతజలసేతు బంధనమేల ?

సత్య——నేనేమి చేయఁగలను; ఇంతతో ఋణము తీరినదను కొందును: తమకు నాతోఁ గావలయునది యేమి ?

సీ॥ ఉవిద యెవ్వత నోఁచియున్నదో యీశమం
తక రత్నమింక నౌదల ధరింప
నీ రైవతక శైల చారుకూటవిటంక
కేళికింకెవ్వతె పాలుపడునో
యెవ్వతె కబ్బునో యీవసంతారామ
కర్పూర కదళికాగార వసతి

లీల నీమణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడఁగలదొ
యకట నేఁ బెంపఁబెరిఁగిన శుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరునొక్కొ
నన్ను నాతోడి సవతులు నగకమున్న
పంతమలరంగ నిన్ను మెప్పింతుఁగాదె.

కృష్ణు—భామా! నన్ను బెదరింపఁ దలఁచితివా? అటులైన నే
నేమి సేయువాఁడ.

సత్య—కృష్ణా! యిటులైన నేనేమి సేయుదాన, నన్ను నెవ్వ
తెనుగానోఁ జూచితివి. నాభక్తి నీమది కెక్కకపోయెనా?
నీయాశ్రిత సంరక్షక, భక్తపారిజాత బిరుదముల మఱ
చితివా!

అని యిట్లు కురంగనయన తరంగముల తెఱంగునఁ
దుఱంగలించు బాష్ప జలంబుల నాపికొనఁజాలక మోముపైఁ
బయ్యెద చెఱంగుఁజేర్చి యొత్తికొనుచు లేమావిచిగురులఁ
దిని మెలుఁగురాచిన కోయిల నెలంతవలెఁ గాకలీకలరవంబు
లొలయ గద్గదస్వనంబున విలపించె. అపుడాకుహనాగోపా
లుండు శిశిరర్తుపద్మంబున నుండివోలె నప్పద్మనయనానయ
నారవిందములనుండి దొరంగుకన్నీరును నిజనఖాంచలమునం
దుడిచి బుజ్జగించుచు నిప్పటి కీయమగర్వభంగమైనది. ఇం
తియ చాలును. ఇంతకంటె నీవాల్గంటిని గుందంజేయఁదగదు,
ముందు చూచుకొందమని యయ్యాశ్రిత రక్షకుండో యింతీ!

యింతమాత్రంబునకు నీకింతవంతయేల? రుక్మిణికిడిన పుష్పము. నీకు లేకుండెనని వగవకుము. ఇందుకు దడ్డమువచ్చినను బాహుం దోర్బలి, స్వర్గంబునంగల పారిజాతవృక్షముం దెచ్చి, నీ కేళీవనం బులోని చెంగల్వకొలనికెలనఁ జెలువలరు కర్పూర కదళికాది తరువుల నడుమఁ బెరటిచెట్టుగ నాటించువాఁడయ్యెనని యను భోజనయనుండు గంభీరతర మధురవాక్యంబుల నుడివె. అపుడు తథాస్తు తథాస్తని యామోదించుచుండెనో యనఁ దన్మందిర శుకశారికామయూరికలు కలకల రవంబులఁ బ్రతి ధ్వనులొసంగె.

—( సత్యభామ కృష్ణుని గౌరవించుట )—

ఆమాటలు సత్యభామ కమృతమయములయ్యెను. ఆ యిందువదన డెందమున నానందరసము పొంగిపొరలి పాఱెను. మొగమునఁ జిఱునగవు మొలకలెత్తెను. ప్రాణేశ్వరునిదివ్య శరీరమును నయనకుసుమములచే నలంకరించెను. మధుర వాక్య కోకిలాలాపము లమ్మాధవవృక్షమునం జెలరేఁగెను. కృష్ణుఁడానందవివశుఁడైనట్లు కన్పట్టెను. అంత సత్యభామ సైఁగ లంబట్టి పరిచారికలు కృష్ణునకుఁ బరిచర్యలం గావించిరి.

క॥ తలిరాకుఁ బోఁడియొక్కతె
జలకమునకు వేళయనుచు శౌరికి వీణా
కలకలముఁ గలకలనగు
పలుకుల మెలపొలయ విన్నపముఁగావించెన్.

సీ॥ చెందిరికపూవన్నె జిలుఁగుదువ్వలువను
దడియొత్తె నొక్క కాంతాలలామ
కొనగోళ్ళ నెఱులుసిక్కులువాపి మెలపున
శిరసార్చె నొక్కలేఁజిగురుఁబోఁడి
వెన్నెలనిగ్గులు వెదచల్లెడు మడుంగు
లందించె నొక్క పూర్ణేందువదన
నవరత్నమయ భూషణవ్రజంబులుమేనఁ
గీలించె నొక రాజకీరవాణి
విరులసరులిచ్చె నొక యరవిందగంధి
యలఁదెఁ జందన మొకధవళాయతాక్షి
సుదతియొక్కతె కపురంపు సురటి విసరె
నిలువుటద్దంబు నొకయింతి నిలిపె నెదుట.

అంత సత్యభామయు మేఘమండలంబుఁ దిగనాడినపూర్ణ చంద్రకళపగిది రాత్రిసమయంబుఁ బెడఁద్రోచిన పద్మినికైవడి, వేసవిం బాసిన నవమాలికాలతిక చాడ్పునఁ, గలఁకందిగఁ ద్రోచి తేజరిల్లుచుఁ దొంటియట్ల దివ్యాంబరాభరణంబులం దాల్చి, యడుగు దామరలం బసిండి గిల్కుటందియలు రవళింప, మందమందగమనంబుల రాయంచకరణి నగుదెంచి చందురునిచెంగట రోహిణీతారకైవడి నాగోపాలచూడామణి చెంత నిలిచియుండె.

పతి పారిజాతమిడకుండుటంబట్టి సత్య యీర్ష్యను వహించి విరసోక్తులాడుటయు, కాముకునివలెఁ గృష్ణుఁడామె

ననునయించుటయుఁ గనుపట్టుచుండుటచేఁ దత్త్వ మెఱుంగని వారు సత్యయందుఁ బూర్ణభక్తిలక్షణము, కృష్ణుని యందీశ్వరలక్షణము లేదని శంకింపఁదగదు.

మనోవాక్కాయములలో మనసుప్రధానము. మానవుఁడేపనిచేయుచున్నను మనస్సు భగవంతునిచర్యను మననము చేయుచు నిశ్చల మయ్యెనేని యది భక్తియై వానికిహపర సుఖములీఁజాలును. ఒకఁడొక ప్రాణపదవస్తువు పోయెనేని యేపనిఁజేయుచున్నను దానావస్తువునే నిరంతరముఁదలఁచుచుండును. అట్లుతలఁచుటయే మననము. తలఁపఁ దలఁపఁ జిత్తమా వస్తువునందే నిలకడగా నుండును. అటులనే శారీరకకర్మ మెటులుండినను మనము భగవద్గుణానుభవము నుండి కదలక . తైలధారవలె నవిచ్ఛిన్న స్మృతిసంతానాత్మకమై యుండెనేని యాతండీశ్వరానుగ్రహ పాత్రుండగును. భజగోవిందశ్లోకముల యందిట్లే చెప్పఁబడినది.

శ్లో॥ యోగరతోవా భోగరతోవా ।
సంగరతోవా సంగవిహీనః ।
యస్యబ్రహ్మణి రమతేచిత్తం ।
నందతి నందతి నందత్యేవ ॥

ప్రహ్లాదుండును భక్తివశముచేఁ బలువిధంబులుగఁ బ్రవర్తించి నట్లున్నది. కావున సత్య యెట్లు మాటాడినను మనంబీశ్వరాధీనమగుటచేఁ బూర్ణశక్తియనుటకు సందియములేదు. కృష్ణుండును సర్వజ్ఞుండు గావున నిపుణోక్తులచే చిత్తైకాగ్ర

త్తను బరిశీలించి వగపఱిదాంతయుఱయ్యెను. ఇదియునుం గాక గోపికలు కామముచేతను, కంసుఁడు భయముచేతను, రావణాదులు విరోధముచేతను, శుకాదులుజ్ఞానముచేతను, ఇంక నెండెందఱెన్నెన్ని మార్గంబులచేతనో భగవంతుని వశపఱచుకొన్నట్లనేక మహాగ్రంథములు నుడువుచున్నవి.

ఇట్లు శ్రీకృష్ణుండు సత్యభామామనోరథ మీడేర్పనెంచియు, నారదోద్దేశమున సఫలము చేయం దలంచియుఁ బంతకుమున్న నరకునిం జంపి తెచ్చి తనయొద్ద దాఁచియుంచిన యదితికుండలముల నదితికొసంగ నిశ్చయించియుఁ దాస్వర్గంబున కేగ సనుకట్టైను.

## నరకాసురుని చరిత్రము

శ్రీహరి నరకాసురు నేలచంపె? అదితికుండలములు హరియొద్ద నేలయుండె? నన

జనమేజయా? తొల్లి నరకుండను దానవుండు భూదేవికిఁ దనయుండై జనియించి యపారవిక్రముండును, క్రూరకర్ముండునై యుండె. ఆరక్కసుండు తక్కిన రక్కసులకునెల్ల నేడుగడయై యుక్కుమిగిలి లోహమయంబులగు సప్తప్రాకారంబులచేఁజుట్టఁబడిన ప్రాగ్జ్యోతిషపురంబును నివాసంబుగాఁ జేసికొని యందధివసించుచుండు. తత్పుర దుర్గంబులుదుర్గమంబులగుటచే నన్యులకందుఁ బ్రవేశింప నశక్యంబు. వానియాజ్ఞ సింహాస్వప్నంబగుటఁజేసి మింటనరుగు దేవతలేని తత్పురంబు మీఁదుగ నావలకుంబోవ వెఱతురు ఆసోఁకుమూఁకల జోదునకు వెఱచి

మే కాంబోలు సూర్యుండు తత్పురిపై నరిగరాక యుత్తరా
యణ దక్షిణాయనంబుల నేగుచుండు. అతని భీకరాకారంబుఁ
జూచి లోకభీకరుండగు యముండుం గూడ వెఱచునన్న సందే
హింపం బనిలేదు. అద్దైత్యవల్లభునిరాకఁ గాంచిరేని సిద్ధవిద్యా
ధరాదులైన ముసుకువైచుకొని మూల దాఁగవలసినవారే.
అన్నృశంసుని ప్రయాణము దేశమునకు ధూమకేతువు. ఆదు
స్స్వభావుని దర్శనము తాపసులకు నైధనతార. ఆవిక్రియా
వంతునకు దేవతలపై దాడివెడలుట. నల్లేరుపై బండినడక
వానికి శాంబరీవిద్య కరతలామలకము. ఆపాపరతునకుఁ బర
స్త్రీ పరధనాపహరణమన్న నిత్యకర్మానుష్ఠానము. ఆమహాభక్షు
కుండు గజసింహశతంబుల పలలంబు భోజ్యపదార్థంబుగా,
వ్యాఘ్రామిషంబు సూపంబుగా, వన్యమృగంబుల నం
జుళ్లు పచ్చళ్ళుగా, మానవమాంసంబులూరుఁ గాయలుగా, రాజ
రక్తంబులు చోష్యతక్రంబులుగా, నిత్యంబును భుజించుచుండు
అతనికడ సుగుణంబులు కలవో లేవో చెప్పఁజాలముగాని
దుర్గుణంబులుమాత్ర మొక్కటియుఁ దక్కువలేక యుండు.
అగ్నిదేవునకు వాయుదేవుఁడు తోడైనట్లు మురాసురుండను
వాఁడు వానికిఁదోడై పరమమిత్రుఁడుగా నుండును. వారు
భయమనునదెట్టిదో యెఱుఁగరు. నరకుండొక్కయెడ
మురాసురసహితుండై ససైన్యంబుగాఁగదలి దిక్పాలకులపై
దండువెడలి, నిర్జరేంద్రుని నిర్జించి, యతని మణిపర్వతంబును,
తజ్జననియైన యదితిదేవి కర్ణకుండలములను, వరుణుని ఛత్రం

బును, హరించి సజయుండై స్వస్థానంబున నుండె. ఆదుర్మ దాంధుం డెప్పుడును దేవతలకు గుండెలో గాలమ్మై సురయూ థంబుల వేధించి బాధించును గాని మానవుల భాగ్యంబునఁ గాఁబోలు లెక్కసేయక తఱచుగా మనుజులపై కేగువాఁడు గాఁడు. జగద్ద్రోహియగువానిం దిట్టనివారును, వానికి వెఱచు దాఁగనివారును గలికముసకైనం గానరారు. ప్రతాపవంతుం డైనను లోకోపకారకుఁడు గాఁడేని జనులకుఁ బ్రియుఁడుగాక పరితాప కారకుండగుఁగదా!

క॥ జలధరుఁడు నిమిషమరిగిన
వలనొప్పఁగ సర్వలోకవల్లభుఁడగు: ను
జ్వలరవి కరములనెప్పుడు
నిలఁజల్లినఁ దాపకారియే యగుఁగాదే.

ఇంద్రుండా నరకబాధలఁ బడఁజాలక సర్వసమర్థుండని యెఱిం శ్రీకృష్ణుని ద్వారకనదర్శించి తద్దైత్యకృత్యంబులం దెలిపి మాయాపదల నెడబాపి కాపాడుమని గోపాలకృష్ణుని వేఁడె. శ్రీహరియు శరణాగత రక్షకుండుగాన నిందున్రిన కభ యంబిచ్చి వీడ్కొలిపి యయ్యసురవిదళనము సలుప సమ కట్టఁగాఁ దన్నుంగూడఁ గొంపొమ్మని సత్య వేఁడె. హరిదానికం గీకరించిమక్కువతో నక్కలికి వెంటరా గరుడు నధిరోహించి ప్రాగ్జ్యోతిషంబుఁజేరి తత్ప్రాకార సప్తకంబు నురుమాడె. ఆ ధ్వనికి గుండియలవియ మురాసురుండు• సేనతో దురమునకు రాగ హరి యయ్యసుర రూపుమాపె. అంత సక్రోధుండై

సరసుం డట్టహాసము నేయుచు విలయరుద్రుని భంగిఁ గృష్ణుని బ్రహరింప నేగుదెంచె. వాని యౌద్ధత్యంబు నూచి కుతుకంబుతో సత్య హరియాజ్ఞం గొని యసురుం దాఁకి సమరంబు నేయుచు, శృంగారరస తరంగంబులోలయు విభంగనుచు హరి యబ్బుర పడఁ గొంతదడవు చిత్రరణంబు గావించె. తుదకాకవ్యా ముండు హరిచే హంతవ్యుండు గాన నసురులఁ దొలంగి పరమ పదంబుఁ జూఱగొనియె. కృష్ణుం డదితికుండలంబులం గైకొని యేగి వాని తనయొద్దఁ బదిలపఱచె. తత్కుండలముల నా జనని కొసంగుట కదియ యదనని తలఁచి త్రిదివంబున కేగ సంసిద్ధుఁడయ్యె.

—— ♦ సత్యా కృష్ణులు స్వర్గపురి కేగుట ♦ ——

అంత నారేయి మధురభోజనంబు గావించి సత్యా కృష్ణులిరువురును బ్రియమధుర భాషణంబులతో సుఖనిద్రఁజెం దిరి. ఆరాత్రి కడచె

చ॥ మఱిమఱిపల్చనయ్యెఁ గలిమాన్యజనుల్ వలె స్థూలతార,లం
బరము ప్రసన్నమయ్యె మునిమానసమట్టుల, నంతటందమం
బరిగెను సజ్జనాళిహృదయంబుల పీడ్వడి మోహమట్లు, రే
యరిగెడునుఁ నిరుద్యమ జనావళి సంపదకై వడిఁ వడిఁ

అపుడు వందిమాగధు లిట్లుపాడుచు శ్రీకృష్ణపరమా త్ముని మేల్కొలుపఁ దొడంగిరి.

సీ॥ చోఱవై వాకాశిదూఱి చోరునిజీరి
మీఱుచాఱువిహార మేలుకొనుము.

P Venkateswarlu

మేటి తాఁ జేటి బూమెలుపూని మంధాన
శైలమెత్తినధీర మేలుకొనుము
ఘోణివై సంభృతక్షోణివై రిపుయుద్ధ
కేళిఁగూల్చిన శూర మేలుకొనుము
భక్తుమాటలఁబట్టి బలుకంబమునఁ బుట్టి
మెఱసిన నరసింహ మేలుకొనుము

గీ॥ లీలవటువృత్తిగనుధన్య మేలుకొనుము
మేదినీశ ప్రవర్ధన మేలుకొనుము
శూలి కోదండఖండన మేలుకొనుము
నీల నీలాంబుదశ్యామ మేలుకొనుము

ఇట్లు ప్రబోధితుండై నందనందనుండు కాల్యకరణీయంబులం దీర్చి స్వర్గపురీ గమనోన్ముఖుండై దివ్యవేషమును ధరించె. శంఖచక్రాది సాధనంబులం గైకొనియె. సత్యాకాంతయు నింతింతనరాని సంతసమ్మునఁ బన్నీట స్నానమాడి చంద్రికావి చీర ధరించి, నవరత్నఖచిత భూషావిశేషంబుల నలంకరించి, యవిరళ పరిమళ మిళితంబులగు నవమాలికాది కుసుమంబులఁ బెన్నెఱివేణిం గీల్కొల్పి, నిలువుటద్దంబుఁజూచి సొబగునకు మెచ్చుకొని, పూఁచిన తంగేడువలెఁ దేజరిలుచు రెండవ లక్ష్మివలె నొప్పుచు నడబెడంగుల నేతెంచి యనంగ జనకుని కురంగట మెలంగుచుండె. అప్పుడప్పరమ పురుషుండయ్యొప్పులాడి మెప్పులకు ముదంబుప్పతిల్ల మనంబున గరుత్మంతునిం దలంప

సీ॥ వజ్రంబునకు నీకవై చిన బలశాలి
గజకచ్ఛపాశన ఘాతుకుండు
జననిదాస్యంబు నీఁగిన కులశ్రేష్ఠుండు
దుర్లభామృత పశ్యతోహరుండు
కమలాప్త సారథి గారాబుఁ దమ్ముఁడు
కశ్యపకృత పుణ్య కర్మఫలము
సకల శకుంతౌఘ సామ్రాజ్యధౌరేయుఁ
డహిమృగయా వ్యసనాకులుండు
మింటిపాళెంబులేర్చు ముక్కంటితూపు
గజనిపాతిత రోహిణస్కంధుఁ డనిల
మానసాతీత వేగసంపద్ఘనుండు
తార్క్ష్యుఁ డేతెంచె దానవధ్వంసికడకు

ఇట్లువచ్చి గరుండుం దమ్మురళీవినోదికి జోహారొనర్చి యెదుట నిలువంబడ దైత్యాంతకుం డా నాగాంతకునితో గత దివసంబున నారదుం డేతెంచి కుసుమం బొసంగుటయు, సత్యాకోపకారణంబును, దానంజేసి తా సురతరువుం దేర నమర లోకంబున కేగ నెంచుటయు వివరింప వైనతేయుండిట్లనియె.

"దేవా! యేను మున్నమృతంబుఁ దేనేగ నింద్రుండు మత్కార్య విఘ్నంబు సేయఁ గలహంబునకై కాలుద్రవ్వి నాపై కేతెంచె. నేనానిలింపవిభుని పీచం బడంచి మత్కార్యమ్ము సఫలముఁ గావించుకొంటి. అదిమొదలు సురపతి నాయెడ నలుకవాఁడయియున్నవాఁడు. నాచలం

బును మఱలఁ జూపుతరుణం బెపుడు వచ్చునోయని నిరీక్షించు చున్నాఁడ. దేవర యెడ నాతండు సగౌరవంబుగఁ బ్రవర్తింఁడేని నాకోరిక యీఁడేర్పఁగలదు' అని విన్నవింప శ్రీహరి యౌను నీవంతటివాఁడవేయని గరుడు నగ్గించుచుఁ దానా స్వర్ణ గాత్రితోఁడ సుపర్ణుపర్ణంబుల నధిరోహించె.

పిమ్మటఁ దార్క్ష్యుండు హుమ్మని మింటికెగయఁ దదీయ పక్షవిక్షేపంబునఁ బొడమిన పెనుగాలిచే నగశృంగంబులు కొంతదూర మంపవచ్చి మరలి వెనుకకుఁజను బంధువులకరణి నెగిరి క్రిందికింబడుచుండె. ధరణీపరాగంబు దూదిపింజలమాడ్కి, జెల్లాచెదరై భూతలంబు నావరించు చుండె. చెట్లయాకులు శత్రువులువోలెఁ బరస్పర సంఘర్షణంబునం గూలుచుండె. సత్యాకృష్ణులు దివ్యవిమానంబున నేగు పుణ్యపురుషులో యన్నట్లు స్వర్గంబున కరుగుచుండిరి. ఇట్లుమింట నేగుచుఁ బుడమివైపునకు దృష్టిసారింప వేగంబునం బాఱునేఱులు మహీంద్రాకు నాగుబాముల కరణి, శైలంబులు బొమ్మరాల మాడ్కి, మహామహీరుహంబు లుర్వి మొలచిన పచ్చగడ్డి భాతి, సముద్రంబులు నీలమేఘంబులచాయఁ గనుపట్టు చుండె. గరుడుం డతిజవభరంబునఁ గరువలి కరణి నరుగు చుండ మేరుపర్వతంబు పొడసూపె, దాని రత్నచ్ఛాయాచ్ఛటలు నభంబు నాచ్ఛాదించుచుండ నమ్మెచ్చెకంటి యచ్చెరువంది యియ్యది యేమియనఁ గృష్ణుండిట్లనియె.

'దేవీ! యియ్యది మేరుపర్వతంబు. ఇది ధరణీమండల

మునకు మధ్యభాగంబుననున్న బంగరుకొండ. దీని చఱియలు రత్నమయంబులు. ఇందు దేవ యక్ష కిన్నర కింపురుషాదులు వసియింతురు. దీనిచుట్టి దిక్పాలుర పట్టణంబు లుండును. ఇది మానవులకగోచరము. ఇయ్యది కేవలపుణ్యనిలయము. మన మిపుడుస్వర్గంబుదరియవచ్చితిమి. పుడమియందలి మహాపుణ్య వంతులు దేహాంతరంబునఁదీనిఁజూడనోపుదురు. ఇందుండువారికి ముదిమి యాఁకలి దప్పి దుఃఖము కష్టము నుండదు. ఆముందు కన్పట్టినదియే యాకాశగంగ. ఆనదిని దర్శింపఁగలుగువారు మహాధన్యులు. అది పరమేశ్వరుని జటాజూటంబు వెలువడి స్వర్గ మర్త్య పాతాళలోకంబుల వ్యాపించినది. ఆతటినీమ తల్లి సర్వపాపంబులఁ బాపునది గాన దివ్యమునీంద్రులు గూడ నం దవగాహనంబు సేయుచుందురు. దర్శింపుము? అనుచు నేఁగుచుండ నవ్వియద్గంగాతరంగిణీ తరంగంబుల యభంగుర రవంబులు శ్రవణానందము గావించుచుండె. అపుడయ్యిందు వదన మందాకినికి వందనంబులర్పించి 'గోవిందా! యాపురంద రునకు మనము కననేగు మందారతరువెట్లు లభించెనో విన వలతు నానతిండన ముకుందుండిట్లు నుడువఁదొడఁగె.

### కృష్ణుఁడు సత్యకుఁ బారిజాతము పుట్టినవిధము దెలుపుట

సృష్ట్యాదినుండియు దేవదానవులకపారంబగు పోరు జరుగుచుండెడిది. వారిలో దేవతలు సహజశాంతులై మహా ప్రభావసంపన్నులై యీస్వర్గంబున వసియించుచుందురు. బలిష్ఠులై గర్విష్ఠులగు నసురులు కండకావరంబున సురలం బీడి

కొని చెండాడుచుండ నమరు లుపాయబలంబున వారినోర్చు చుండిరి. అపుడు మానవలోకంబేలు బలిచక్రవర్తియను దానవేంద్రుఁడు నిజబల ప్రతాపాతిరేకంబున స్వర్గంబుపై దాడు వెడలి బృందారక బృందంబుల నోడించి యమరేంద్రుని పైకి హుటాహుటినేగి వానింబట్టి కట్టి పిడికిటిపోటులందట్టి కొట్టిన నిలువఁజాలక బలాంతకుండు పలాయితుండయ్యె సుర లెల్లరుఁ గకావికలై దిక్కులకుంబాఱిరి. అంతనాబలి బలీయుండై త్రిదివంబు నాక్రమించి యేలుచుండె. సుర లనాథు లైరి. బహుశతాబ్దంబులు కడచినవి. మఱల నెట్లయిన నసురుల నోడింప యత్నించి సురలెన్నియో నారులు పోరిరి గాని వారి ప్రయోజనంబులు బూడిదెంబోసిన యాజ్యంబు కరణి నిరర్థకంబులయ్యె. అంత నాక్రతుభుజులు దేవతాపక్షపాతి యగు విష్ణుం బ్రార్థింప వైకుంఠధామంబున కరిగిరి. పురుష సూక్తమంత్రంబుల నుపాసించిరి. స్వామీ! జగద్రక్షకా ఆపద్బాంధవా, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా, ఆర్తశరణ్యా, పరమపురుషా. కటాక్షింపుము. మామొర నాలింపుము. మాప్రాణంబులఁ గాపాడుము. నీవు తప్ప వేరుదిక్కు గానము. ప్రసన్నుండవగుము. అని బహువిధ దీనాలాపంబులఁ బ్రార్థించిరి. అపుడా యాదినారాయణుండు వారికిం బ్రసన్నుండై యాదరించి జడుపుదీర్చి వచ్చిన కారణంబడుగ సురలు తమ దురవస్థనంతయు హరికి నివేదించిరి. దాని విని విష్ణుండు వారికిట్లొక యుపాయంబు సెప్పె:

త్రిదశులారా! మరణము కలుగనీయని పరమౌషధం బమృతంబు. ఆయౌషధంబు మీరును, బలిష్ఠులగు దానవానీకంబులును గలిసి సాధించినంగాని లభ్యంబుగాదు. కావున మీరు పూర్వవిరోధంబుఁ బాటింపక పూర్వదేవులం జేరి, యనునయవాక్యంబుల ద్వేషభావంబు మఱపించి మైత్రిసలిపి హృదయమర్మంబు నెఱుకపడనీక యేకోదరులవలె మెలంగుచు వారికమృతోత్పాదనంబున నుత్సాహంబుఁ గలిగించి వారి సహాయంబుచే మందర నగంబును క్షీరసాగరంబునం జేర్చి వాసుకిని రజ్జువుఁగా నొనర్చి చిలుకుఁడు. అందమృత ముద్భవించును. అద్దాని నుపాయవశంబున రక్కసులకుఁ జిక్కనీక మీరుత్రావుడు. లేని మృత్యువును జయింపఁగలరు. పొండు మీయత్నంబులు ఫలించుఁగాక. యని వారలననిచె.

సురలును శ్రీహరియాజ్ఞ యగుటం జేసి పౌరుషంబు దిగఁద్రోసి వినీతవేషులై కొలువున్న బలిం జేరి యందఱకు నమస్కరించి 'అన్నా మనకు వైరమేల? అజ్ఞానమున మేమొనర్చిన నేరంబుల సైరింపుఁడు. మీకు మేము దాసులముగాని యధీశులము కాము. ఇదియునుంగాక కశ్యపుని పత్నులలో దితిసంతతివారు మీరు. అదితిసంతతివారము మేము. కావున మనమేకజనకులము సహోదరులము. మమ్మును మిత్రభావంబునఁ గైకొనుఁడని వేఁడ వారంముల కియ్యకొనిరి. సమానబలుండగు శాత్రవుండు పాదాక్రాంతుండయ్యె నేని వీరు లమితోత్సాహవంతులై పూర్వవిరోధం బెన్నరుగదా! పాపము

మహోపాయంబుల కాలవాలంబగు దానవ మృగజాలంబు దేవతల మాయావాగురం జిక్కె. అంతం గ్రతుభుజులు క్రమక్రమంబున రాక్షసచక్రంబున కమృత సంపాదనము నందాసక్తిఁ గలిగించి తదుపాయంబుఁ దెలిపి యుభయపక్షముల వారును మందరగిరి కేతెంచిరి. దేవతలు ముప్పదిమూఁడు కోట్లు. రాక్షసులునంతజే. వీరందఱు బహు ప్రయత్నంబుల నన్నగంబుఁ ద్రవ్వి పెకలించి శిరంబులపై కెట్లెట్లో యెత్తుకొని క్షీరాబ్ధికిం జనుచు మోయఁజాలక మార్గమధ్యమున నాశిఖరింబడవైచిరి. రాక్షసు లాపనిదుస్సాధ్యమని నిస్పృహులై చనిరి. దేవతలొండుపాయంబుఁ గానక మఱల వైకుంఠంబు నకరిగి హరిం బ్రార్థింప నాభక్తవత్సలుండు గరుడవాహనారూఢుండై యేతెంచి సురాసుర దుస్సాధ్యంబగు నాశైలంబుఁ దన యెడమచేత నెత్తి గరుడుని ఱెక్కలపైఁబెట్ట, నాతండుం భగవదాజ్ఞానుసారముగా దానిం దుగ్ధాబ్ధియందుఁ జేర్చె. సర్వశక్తియుక్తున కెద్దియైన నశక్యంబగునే?

గీ॥ అతిసమర్థులకిల నసాధ్యంబులేదు
పోలనుద్యోగికిని దూరభూమిలేదు
విద్యగలవాని కెందును వింతలేదు
వఱలు ప్రియవాదికిని శాత్రవంబులేదు

అంత సుర లసురులంబిలిచి వాసుకిని గవ్వపుఁద్రాడుగాఁజేసి మూఁడు చుట్లుగాఁజుట్టి సురలోక వైపున, నసురులోక వైపునంబట్టి మథింపఁదొడంగిరి. అపు డాతఱి కొండ సంఘర్షణ

ధారంబునవార్ధిమునుంగఁజొచ్చిన హరికూర్మరూపుండై మంద
రంబును వీపున మోయుచు మునుఁగనీకెత్తె. తఱచునెడ వెలిపి
డిచేనాపాపజేనివలనభీషణవిషంబుజనించిలోకంబులభస్మంబుఁ
జేయఁజొచ్చె. రక్కసులదరి పాఱిరి. అపుడు సురలు తమ
మనంబున హరిం బ్రార్థింప శంకరుం బ్రార్థింపుఁడను మాట
వినరాఁగా నా దేవతలు శ్రీకైలాసధామంబున కరిగి శివుని
వేఁడ నాభక్తసులభుండు ప్రత్యక్షుండై వారల కార్యంబు విని
తనగమనంబునకు వెఱచు పార్వతికి ధైర్యంబుసెప్పి వచ్చి
విషంబు నంతయు నుండగాఁజేసి నోటవైచుకొనియె. అది
దహనశీలమగుటంజేసి యుదరంబునం జేర్చినచోఁ దత్ప్రదేశ
స్థితలోకంబు వినాశం బొందునని యెంచి దానిం దనకంఠంబు
ననే యుంచి గరళకంఠుండను పేరం బ్రసిద్ధుండై వారి భయం
బువాపి నిజధామంబునకరిగె. మఱల దేవాసురులబ్ధి మథింపఁ
జొచ్చిరి. అంత నాపయోరాశియందు సాత్రాజితీ! మనమిపుడు
తేనేగు నాపారిజాతము, కామధేనువు, చింతామణి, కౌస్తుభ
రత్నము, ఉచ్చైశ్శ్రవమను హయరాజము, ఐరావతమను గజ
రాజము, లక్ష్మీదేవి, చంద్రుఁడు మొదలగు ననేక వస్తుజంతు
సంతానంబు లుత్పన్నమయ్యె. వానిలోఁ గొన్నింటిని సురలు,
కొన్నింటి నసురులునుగైకొనిరి. తుదకం దమృత ముద్భవిం
చెను. ఆపీయూషమును దేవతలు గైకొననెంచిరి గాని యది
బలిష్ఠులగు రక్కసులకుం జిక్కెను. గోఱుచుట్టుమీఁద రోకలి
పోటన్నట్లు దనుజులవలనఁ దమకు మఱింత భయము కలుగు

నని వగచి సురలు హరిం బ్రార్థింప నవ్విభుండు జగన్మోహినీ రూపంబుఁదాల్చి రక్కసులకు మోహంబుఁగల్పించి యా సుధాభాండంబు గైకొని మీకును సురలకును సమాధానంబు గాఁబంచి యిత్తునని యసురులనమ్మించి వారి నిరుబంతులుగాఁ గూర్చుండ నియమించి యాచావుతేని మందును దేవతలకే యొసంగెను. మోహనీభ్రాంతిచే రాక్షసులు మెదలకుండిరి. తుదకు మిగిలిన సుధతోఁ గూడ మోహిని యంతర్ధానం బయ్యె. రక్కసులు నిరర్థకులై సురలతో బహుకాలంబు పోరిరి. కాని వారి యమృత ప్రాశన బలంబున కోర్వలేక చనిరి. ఉపాయశూన్యుల బ్రతుకిట్టిదియే కదా' అంత దేవతలు స్వర్గము నాక్రమించుకొని కల్పవృక్షాదుల నందుఁ జేరిచి సుఖముండిరి" అని హరి సత్యకిట్టిసంగతులు చెప్పుచు నేగు చుండ స్వర్గంబు దరియవచ్చె.

—— ♦ నారదుని స్వర్గలోక గమనము ♦ ——

అంతకుమున్న నారదుండు హరిభజనంబు సేయుచు నాకంబున కరుదెంచి కొలువుదీరి యున్న యింద్రునింగాంచె. అమరేంద్రుఁడును సభక్తికంబుగా నభివాదనం బొనర్చి మహాత్మా! యద్భుతంబు లేమైనఁ గొనివచ్చితేయన వీణాముని యిట్లనియె. 'సురసార్వభౌమా! యొక విశేషంబు గలదు. నేఁడిదె శ్రీకృష్ణభగవానుఁడు సత్యభామాసహితముగా నీవైభవంబవలోకింప నిచ్చటికి కరుదెంచుచున్నాఁడు. ఏమి నీభాగ్యము వినుము. గంగపాపమును, చంద్రుండు తాపమును, కల్పతరువు

దారిద్ర్యము నడంచును, సజ్జనదర్శనమో పాప తాప దైన్యములఁ హరింపనోపు. అట్టివారి దర్శనంబు సకలదోష సంహారకము, సర్వాభీష్టదాయకంబు నగు. ప్రజ్వలితాగ్నిచేఁ గనక మాలిన్యంబువోలె, మహాత్మ వాక్యోపదేశంబుచే శ్రోతల యంతరంగతమంబు వాయును. దయాపూరితంబగు మహాశీయుల దృష్టి ప్రసరించునేని పాపుల హృదయంబులైనను సత్వగుణ భరితములై దుర్వృత్తులం బోగొట్టి సత్పథంబునం బ్రవర్తిల్లు. అట్టి సజ్జనుల జన్మమే సార్థకంబగుచుండు. మున్ను మహర్షుల దయార్ద్రదృష్టి ప్రసారంబుచేఁ గిరాతుఁడు మహర్షి యయ్యె. దాని వినుము.

## వాల్మీకి జన్మ వృత్తాంతము

పూర్వకాలంబున నొకవిప్రుండు గలఁడు. వానికడ బ్రాహ్మణధర్మంబులు శశవిషాణప్రాయంబులు. సదాచారమన్ననో గగనకుసుమంబు. ఆతని యందు దుర్లక్షణంబు లానేకంబులు ముందు పుట్టినవి. సంధ్యావందనము స్వప్నప్రాయము. చౌర్యధనార్జనమే పరమార్థసంపాదనము. ఆతండు నిజభార్యం బరిత్యజించి హీనకులజను జేపట్టి కులభ్రష్టుండై జననీ జనకులవిడిచియరణ్యప్రాంతంబులనివసించుచుండెను. ఆతఁడుతీర్థయాత్రికులకేగు వారి ధనంబులదోఁచుట యందు సంపూర్ణప్రయోజకుఁడు. మాయానైపుణి యాతనికి నేర్చుకొనకయే వచ్చిన విద్య.

ఒక్కయెడ సప్త మహర్షులు గంగా స్నానార్థమేగు

చుండిరి. ఒక యెడారికడకువచ్చునప్పటికి రాత్రినాల్గవజామయి నది. వారు భగవన్నామ స్మరణము గావించుచుఁజనుచుండిరి వాఁడు వారికంఠస్వరము జాడంబట్టి రొక్కంబు ముచ్చిలింపఁ దన్నికటంబుఁజేరె. పిడుగుంబోలు బడియెం జేఁబూనె. కాలిచప్పుడు వినరాకుండ వారియెదుటికి వచ్చెను. అపుడింకఁ గొంత చీఁకటియుండెను, ఆబొగ్గునుబోలిన నల్లనిమేనును ఆ కొండ శిఖయుం జూడ వాఁడు రెండవ యమకింకరుని వలె నుండె. మున్ముందు వాఁడు చేతి బడియకఱ్ఱ నెత్తెను. గద్దించెను. బాపలారా! వంటయింటి కుందేళ్ళు మీరెక్కడ నెందేగఁ గలరు? మీగుడ్డలు చెంబులు రొక్కము నిక్కడ నుంచుఁడు. దాఁపఁ జూతురేని మీప్రాణంబుల నాదండంబున కాహారముఁ జేసెద. ఇదివఱకు మీవంటి వారెందరో దీనికాహారమైరి. చప్పుడు సేయక మీవస్తువుల నిందుంచి యరిగుఁడు. కాదేని మీప్రాణంబులు దక్క"వని వారిని సామాన్యులఁగాఁ దలఁచి మోదఁబోవ వారు మహాప్రభావ సంపన్నులు గాన భయమందక సంయము లిట్లు నుడివిరి.

ఓయీ! మమ్ముంగొట్టనేల? మావస్తువులెల్ల నివిగో యిచ్చుచున్నారము. కైకొనుము. మా మాట నొకదాని వినుము. నీభార్య నీవిట్లార్జించిన ధనకనకాదుల మాత్రమే యనుభవించునో? మఱియు దీనివలన నగు పాపంబును గూడ ననుభవించునో చెప్పఁగలవా యని యడిగి వారి వస్తువుల నచట నునిచిరి. వారితపశ్శక్తివలన వానికి వారడిగిన మాట

లకు సమాధానము చెప్పవలయు నను బుద్ధి యుదయించెను. నిరాకరింపలేదు. వాఁడు బదులుచెప్ప నెంచెను గాని భార్య యుద్దేశమేమోతోఁపక దాని నడుగనెంచి మునుల నందుండ నొడంబఱిచి కుటీరంబుఁజేరి యుంపుడుకత్తె నామాట నడిగె. అది "నీవు తెచ్చిన ధనధాన్యాదుల ననుభవింతునేకాని నీపాపపు జోలి నాకేల" యని ఖండితముగాఁ జెప్పె. అమ్మాటచే నాతనికి దానియెడ నిస్పృహ గలిగెను. ఈనాసల్పిన పాపభారము నెట్లు వహించువాఁడనని పరితాప మంకురించె. పిమ్మటవాఁడా ఋషుల కడకు వచ్చెను. తెల్లవాఱినది. వారలం గాంచెను. అగ్నిజ్వాలజలమునుం బోలె ఋషీశ్వర దృష్టి యాపాపాత్ముని పాపము నాకర్షించినది.వారు మహాత్ములని వానికిలక్ష్యమునిలిచినది.బుద్ధికుదిరినది.అయ్యలారా!యీపాపుని ధన్యునింజేయుఁడని పునః పునః ప్రణామంబు లాచరించెను. వారికి వానియెడఁ గృపారసమూ విర్భవించెను, "ఓరీ నీవు మేము చెప్పు మంత్రమును మరలి మేమువచ్చుదాఁక శ్రద్ధతో జపింతువేని ధన్యుఁడవౌదు" వనిరి. మహాత్ములారా! ప్రసాదింపుఁడవి నిర్మలచేతస్కుఁడై వేఁడెను. అంత నమ్మునులు పతితునకు యథాస్థితిగా నుపదేశింప రాకుండుటచేఁ బతితపావనమగు రామనామమును వ్యత్యాసముగాఁ జేసి వానికి మరామరా యని జపింపుమని యుపదేశించి యరిగిరి. అంతట వాఁడక్కడనే కూర్చుండి తదేకల్యముగాఁ దన్మంత్రంబును బఠించుచుఁ బాపవిము

ష్టుఁడై కృతార్థుఁ డయ్యెను. తుద కాతఁడే వాల్మీకిమహర్షి యయ్యె. దేహేంద్రియాదుల మఱచి తన్మాత్రంబుచేఁ దపం బుఁజేయుతఱి వానిమేనం బుట్టలు పుట్టుటచే నాతనికా పేరు గలిగె. ఆమహాత్ముఁడే శ్రీరామాయణ గ్రంథకర్తయయ్యెను. కావున మహానుభావుల దయార్ద్రదృష్టి ప్రసారము మహో న్నత పదము నొందింపఁజాలును. మహేంద్రా! నీ వాయుపేం ద్రుని దర్శించి కృతార్థుండ వగుమని చెప్పి ముని యచ్చోటు వాసె.

మునివరుని పలుకులం దలంచి వజ్రపాణి చక్రపాణిపై బత్తి యెట్లున్నను గృష్ణుండు తనకు మున్ను గావించిన భంగ పాటునెంచి యెదురేగకున్న నేమికీడు మూఁడునో యని శ్రీ కృష్ణుని దోడితే నిశ్చయించె.

కృష్ణునివలన జిష్ణునకుం గలిగిన పరిభవం బెద్దియున

## శ్రీకృష్ణుఁడు గోవర్ధన మెత్తుట

శ్రీమన్నారాయణాంశ భూతుండగు శ్రీకృష్ణుండు బృం దావనంబున నందునింటం బెంపొందుచు శైశవంబున నావు లం గాయుచు గోపీ గోపాలకులతో వినోదంబుల సల్పుచుండును. బాల్యాదిగాఁ గృష్ణుని ద్రుంచుటకై మాతులుండగు కంసుఁడొనరించు మహాఘోర కృత్యంబుల నెల్ల నమ్మురద్దకొమరుండు గోటమీటినట్లడంచుటంజేసి నం దాదులెల్లఁ గృష్ణునెడ దైవభావంబు గలిగి యబ్బాలుని పలు కులకు జవదాటకుందురు పూర్వంబు నుండియు సలిపెడి యా

చారంబు వలన నింద్రయాగంబు చేసినచో సువృష్టి గలిగి గోవులకుం దమకు నారోగ్యసుఖంబులు గలుగునని నందాదులింద్రయాగంబు సేయ సమకట్ట బాలకృష్ణుండు నందునితో నిట్లనియె.

“నాయనా! యీ యింద్రయాగంబేల? దేవవిభుండు వర్షప్రదాత కానోపఁడు. సూర్యుని వేడిమివలన జలధరంబులేర్పడి వర్షము గురియుచున్నవి. దానంజేసి తృణసస్యాదులు జనించి వాయువు మొదలగువానిచే నవి యభివృద్ధి నొందును. తృణౌషధులచే జంతుసంతానము లారోగ్యవంతము లగును. ఇంద్రుఁడు కర్తగాఁడు. ఒక్కొక్కరి కొక్కొక్క శక్తినిడిన సర్వశక్తియుక్తుండగు పరమేశ్వరుం డారాధనీయుఁడు. ధ్యానజ్ఞాన జపహోమాదులచేఁ బరమేశ్వరు సేవించుట సమంజసముగాని వేఱొండు గాదు కావుననింద్రయాగంబు నిలువుఁడు. అని తత్ప్రయత్నంబు వారించె. ఏటేటం జరుగు మహోత్సవంబు లేమిం జేసి సురేశ్వరుం డాగ్రహించి యాదవుల కపకృతిం గావింప వేచియుండె.

ఒక్కనాఁడు కృష్ణ బలరాములు శాకంబులు సూపంబులు, పిండివంటలు ఊరుఁగాయలు, పచ్చళ్ళు, దధ్యాదికంబులు, గూర్చి యుక్కటికంబుచేఁ దల్లులు కట్టి యిచ్చిన చలిది యన్నంబులఁ జక్కని చిక్కంబులఁ బెట్టుకొని సవయస్కులం గూడి పసులం గాయ నేగిరి. దట్టంబుగఁ బెచ్చుపెరిగిన పచ్చగడ్డి నాప్యాయనంబుగ మేయుచు ధేనుకదంబం

బులు కడు దవ్వేఁగె. అచ్చటఁ జూపఱ కింపునింపుచుఁ బెంపు గల కొండల గుంపులు గలవు. కృష్ణాదు లచ్చటి విశాలంబు లగు శిలా ప్రదేశంబుల కరుగుచు, దాఁగిలిమూఁత కోఁతికొమ్మంచు బిల్లఁగోడు బంతియాట చెండాట మొదలగు వింతవింతలగు క్రీడల సలుపుచుఁ గేకసలు గొట్టుచుఁ జెట్లెక్కుచు దుముకుచుఁ బరుగులు వాఱుచు నీఁదుచు ననేకవిధ దేహపరిశ్రమలఁ జేయుచు నానందమున నాటలాడుచుండిరి. కాలము మూఁడవజాము కడచుచున్నది. గోపబాలురు వేళమించెనని విశాలోన్నత ప్రదేశములం జేరి చిక్కంబుల యన్నంబును పాణితలంబునం జేర్చి కుడుచుచు, నొకరి పదార్థంబు లొకరడుగుచు, మేలగు నాహారంబుల దొంగిలించుచు, • నీభక్ష్యంబుల కంటె నాభక్ష్యములే రసవంతములని వెక్కిరించుచుఁ, జిత్రప్రసంగములఁ జెప్పుకొనుచుఁ, గర్ణికం జుట్టిన కమల దళంబులు వోలెఁ గృష్ణుని బరివేష్టించి పెండ్లికొమరుల వలె విందు లారగించు చుండిరి.

వర్ష మారంభ మయ్యెను. వ్రేలు భుజించి లేచిరి. కడు దూరమరిగిన యాలం దోలుకొని రానేగిరి. వానమిక్కటం బయ్యె. దశదిశల నాపరించిన జలధరంబులచే జగమంధకార బంధురమయ్యె అది బిందువర్షముకాదు. ధారావర్షము. ఏనుఁగు తొండము లావుధార. తెంపు గన్పట్టదు. వానను మించిన పెనుగాలి. దుర్నీతిచే సంపదలు వోలె నాజంఝావాతముచేఁ దరువులు పెళపెళ విరిగి నేలం గలియుచుండె.

దుష్కృతంబు చేయువారిపైఁ బాపంబులు గొరలునట్లు వడగండ్లు వ్రాలుచుండె. నాఁటి మెఱపుల చిచ్చుచే నాకసంబు భస్మంబగు నోకోయని తోఁచుచుండె. మహాగర్జన వినదంబు ధూమశకట ధ్వానంబు ననుకరించు చుండె. బెడిదంబులగు పిడుగుల చప్పుడుచే జంతుజాలంబుల గుండెయు లవియుచుండె. మహాఘోరము! మహాఘోరము వర్ణనాశక్యము. ఆవర్త సంవర్త పుష్కర ద్రోణ కాల నీలాది నవమేఘము లొక్క పరిగఁ గలిసి కురియుచున్నవి. నదీకుల్యాతటాకాదులు నిండి సముద్రప్రాయంబులయ్యె. ఇదియంతయు నింద్రుని కృత్యము గాని మఱొండు గాదు. "ఏనుఁగు లెగిరిపోవుచుండ దోమల గతియేమి" యన్నట్లు సౌధముల నుండు వారే ప్రాణభీతులగుచుండ మన గోగోపకుల గతి నేమనవలయు? ఎట్లైన నిలు సేరుదమన్నఁ గొండకాలువలు దాఁట వశముగావు. ఆభీరులెల్లరు భీరువులై కృష్ణునిం బేర్కొనుచు దీనాననులైరి. ధేనువులుఁ మోములువంచి కన్నీరు గార్చుచుండె.

శ్రీకృష్ణభగవానుఁ డదిచూచెను. గోగోపకుల గావ నెంచెను. ఇంద్రునకు బుద్ధి తెలుప సమకట్టెను. బలభద్రునకేని దెలుపక మేనువిదిర్చి ముందు నడచెను. అచ్చట కులపర్వతముంబోలిన మహాశైల మొకటి గలదు. దానిపేరు గోవర్ధనము. బాలకృష్ణుఁ డటఁజేరి హుమ్మని విజృంభించి యున్నగంబు నెడమకాలఁదన్నెను. ఆదెబ్బ కది పాదుగదలి యావలకుఁ జరిగెను. బాలగోపాలుండా శైలమొకచేతఁబట్టి యెగురవేసెను. అది మింటి

కెగసి బొంగరమువలె గిరగిరఁ దిరుగుచుఁ గ్రిందికివచ్చుచుండె. కృష్ణుఁడు వచ్చెఁజచ్చెనని భూతము లాక్రోశించుచుండెనోయన మహారవం బుప్పతిల్లె. కొండ తిరుగుచు వచ్చి కృష్ణుఁడు నిలువఁ బెట్టిన చేతికొన వ్రేలిమీఁద నిలిచినది. క్రిందఁ బడలేదు. హరికి బరువుగా నుండలేదు. పదునాలుగు భువనంబుల నుదరంబున నిల్పినపరమేశ్వరునకు, సృష్టిస్థితిలయంబు లొనర్చు భగవంతున కొక కొండఁ గొన గోటనిల్పుట భారమా? అబ్బురమా? చూచువారల కత్యాశ్చర్యము. కృష్ణుని కనిష్ఠకాగమున నిలిచిన శైలము ఛత్రిమువలె నుండెను. అది చినఁగని గొడుగు. ఎంత వర్షము కురిసిననేమి? కృష్ణుండు పిలువ గోపకులం గూడి గోవులు దానిక్రిందికి వచ్చి నిలిచెను. ఇంక భయ మెక్కడిది? గోపాలుర కగ్గిరి గదిపైనమర్పఁబడిన చాందిని వలెఁ గన్పట్టె. సుఖకరముగా నుండె. ఆవులు నెమరు వేయుచు హాయిగాఁ బరుండెను. వర్షము శాంతింపక యథాప్రకారముగా నుండె. తెల్లవాఱునప్పటికిని శాంతింపలేదు. ఇంకను దగ్గలేదు. ఏడహోరాత్రము లొక్కటియే ధార. మాధవు ననుగ్రహముచే గోగోపకులకు క్షుద్బాధలేక తృప్తిగానుండె. లోక క్షయమగునట్లు సప్తదివసంబులు ధారావృష్టి గురిసియుఁ గృష్ణున కిసుమేని కీడు గావింపనేరక, వేల్పుఱేఁడు సిగ్గుగదురఁ దానొనర్చిన యపచారమునకు శౌరి యేమిసేయునోయని వెఱపుగొని వానలేకుండఁజేసె. మేఘంబులుతొలంగి చనియె. సూర్యభగవానుఁడు సుఖప్రదముగా నిజకిరణ జాలం

ఖుల దిగ్భాగంబుల వెలయించె. అంత నయ్యశోదా కిశోరంబు చేతనున్న బొంగరము నావల వైచినట్లు మహీధరంబును విసరివైచె. అపుడు కృష్ణునాజ్ఞచే వల్లవ గోవల్లజంబు లిండ్లకుం జనియె.

అంత శతమఖుండు హారికటాక్షంబు వడయఁగోరి వినీతవేషుండై యరుదెంచి గోవిందునకు సాష్టాంగ వందనము లాచరించి నిలువంబడి యిట్లు స్తుతించె.

శా॥ బృందారణ్యతరుప్రదేశముల గోబృందాగణక్షోణులన్
ఛందోవీథులఁ గానిపించు పరమస్వచ్ఛందహా తేజమా
నందబ్రహ్మము వందనీయమురళీ నాదానుమోదంబు నా
యందుం డానిల్పెదఁ బింఛచూడముప యోజాక్షంబు మేఘాభముల్

మహానుభావా! నిన్నుఁ బురాణపురుషుండవని తెలియనోపక త్రిలోకాధిపత్యమదంబున నపచారం బొనర్చినాఁడ. నాగర్వంబు వాసె. బుద్ధివచ్చినది. పుత్రు నపరాధంబు క్షమించుట జనకునకు సహజముగాన మన్నించి క్షమింప వేడెద.

అని యిట్లు శరణార్థిగాఁగ నయ్యమరేంద్రునెడఁ గృపఁజేసి 'పురందరా! యిఁకఁ బొమ్ము. పెద్దల నవమానింపక జాగరూకుండవై మెలంగుచు లోకపాలనంబున నప్రమత్తుండవై మమ్మారాధింపు చుండు'మని హరిపంచె. అపరాధులగుబలవంతుల నీశ్వరుఁడే శాసించుఁగదా!

### ఇంద్రుఁడు శ్రీకృష్ణుని సంభావించుట

అట్టి లోకేశ్వరుం డరుదెంచ విధేయతతో వర్తింప

కున్న మఱల నేమగునో యని సురలోకేశ్వరుండు దేవతా లోకంబునకుఁ దగు రీతుల సెంటరా నాజ్ఞ నొసంగి కైలాస గిరింబోలు నైరావతంబు నధిరోహించి రంభాదులు గాన నర్తనంబుల సలుపుచుఁ గూడనేతేర,మహావైభవంబున వెడలి వియద్గంగా నికటంబున కరుదెంచె. కార్యజ్ఞుండగు హరి గరుడుని డిగ్గి వినమ్రుఁడై యింద్రున కభిముఖముగా వచ్చుచుండె. సురేంద్రుం డయ్యాదవేంద్రుదర్శించి యైరావతంబు డిగ్గి రత్న కిరీట భాసురంబగు శిరంబు వంచి వినయ నయభయ సంభ్రమంబులు ముప్పిరి గొన ముకుందున కభివందనంబు గావించె. అగ్రజన్యాయంబునఁగృష్ణుండింద్రునకు మ్రొక్కె.బలాంతకుండు మురాంతకునికరకమలంబునిజకరకమలంబునంగిలించి కుశలప్రశ్న మడిగిగౌరవించె. అప్పుడా పరమపురుషున కగ్ని దేవుఁడు జోహారొనర్చె. యముండు కేల్మోడ్చె. నిరృతి దండప్రణామంబు గావించె. వరుణుం డభివాదనమొసంగె.వాయుదేవుండు బద్ధాంజలి యయ్యె. కిన్నరేశ్వరుండు మ్రొక్కె. ఈశానుండు సభక్తికంబుగాఁ బ్రశంసించె. యక్ష కిన్నర కింపురుష సిద్ధవిద్యాధరాదులు వినుతించిరి. అప్సరలాడిరి. హరియును వారలనెల్లఁ దగు రీతుల గౌరవించె, అంత హరి హరిహయాదులు వాహనంబు లధిష్ఠించి రాజమార్గంబున నేగుచుండ సురవనిత లెల్లరు హరి దర్శనాయత్తచిత్తులై తాము సలిపెడి కార్యంబులఁ బరిత్యజించి సౌధోపరిభాగంబులం జేరి సత్యాకృష్ణుల నీక్షించుచు నిట్లు భాషించిరి.

ఒక స్త్రీ— అక్కా! చూచితివిగదా! ఏమి యీ కృష్ణుని సౌందర్యము! ఈ కనుముక్కుతీరు, ఈ ముఖలావణ్యము, ఇట్టి కోమలశ్యామల వర్ణము, మానవులయందే కాక మన దేవతల యందుఁగూడ లేదుగదమ్మా! వీని విడిచి పోఁజాలకున్నాను.

ఒక—ఏమి యీహాసోయలు, మన్మథుఁడుగూడ నీతనికి సాటి గాఁడు. బ్రహ్మనిర్మాణ మీతనియెడ నేఱని చెప్పఁదగి యున్నది. ఔరా! యీసోయగము. ఇట్టివాఁడుగావు ననే పదియాఱువేల స్త్రీలు వశలై యున్నారు.

ఒక—సఖీ! చక్కదనమేగాదు, ఈ మహాత్ముండు పుట్టినపుడే పాపజాతి పూతనం జంపి పలువురు రక్కసులం గూల్చె నట. ఎంతవింత!

ఒక—ఔరా! ఈమహానుభావుఁడు బాల్యమునఁ బశువులం గాయునెడ విధాత గోగోపకులందాఁప నితఁడు మఱల సృజించి యెఱుఁగకుండఁ జేసెనట!

ఒక—సుదతీ! యది సరియేగాని యీధీరుం డెనిమిదేండ్ల ప్రాయమున గోవర్ధనమెత్తెనట! మనవారే చెప్పిరిగదా!

ఒక—సరియేగాని యీముద్దులాడు కాళీయునిపై నెక్కి విహరించెనట! ఏమివింత యమ్మా!

ఒక—ఈ చతురుండు గోపకాంతలఁ బదియాఱువేవురం బెండ్లియాడి పరస్పర కలహంబులు లేకుండఁ జేసెనట! ఏమి వీని కళాకౌశలము!

ఒక—ఔరా! యీ సత్యభామ చక్కదనము చెప్పనలవికాకున్నది! భార్యలందఱు నిట్టివారే కాఁబోలు? ఏమి యీ మహనీయుని భాగ్యము!

ఒక—ఈ పురుషరత్నమును బెండ్లియాడిన చేడియల పుణ్యమే మోకదా: ఈతని నెంతచూచినను దనివిదీఱకున్నది,

ఇట్లనుకొనుచుఁ గృష్ణచర్యలెన్నుచు, వినుతించుచుఁ, గోర్కెలం జొక్కుచు, విరులం జల్లుచు సంతోషపరవశలగుచుండిరి. దేవకీతనయుండు సురనికరపరివృతుండై చనుచున నింద్రుఁడు మహాత్మా! యిదె మదీయమగు వైజయంతమను సౌధరాజము ఇంక వేంచేయుఁడని తోడ్కొని లోనికిం జనియె.

## శ్రీకృష్ణుఁ డదితికిఁ గుండలము లిచ్చుట

ఆప్రాసాదము స్వర్గనగరిం గల మేడలలోనెల్ల నగ్రగణ్యము. అది రత్నమయము. అందలి కట్టడముల చమత్కారము, అందమర్పఁబడిన దివ్యవస్తువుల పొందిక, అందలి చింతామణి కాంతుల ధళధళాత్కారము, మందారపారిజాతాది పుష్పపరిమళవిశేషముం గన మఱియొండు చిత్రంబుఁ జూడఁ దలంచు వారుండరు. అది వర్ణనాతీతము. అందుఁ జింతామణీ రత్న పర్యంకమున మందార కుసుమవిరచిత శయ్యపై దేవజననియగు నదితిమహాదేవి యధివసించె. ఇంద్రపత్ని యా సాధ్వీమణి యడుగుఁదమ్ముల నొత్తుచుండె. విద్యాధరాంగనలు పద్మపుష్పదళంబులగు వీవనలం గొని వీచుచుండిరి. సురగణ

డాంగనలు కపురంపుపీఁక యొసఁగుచుండిరి. ఆమహిళా లలామకు సరస్వతీమహాదేవి కథలం జెప్పుచుండె. ఋషికాంతలు వినయావనత్లై మ్రొక్కుచుండిరి. అమ్మహాజననికి సత్యతోఁగూడఁ గృష్ణుఁడు సభక్తికంబుగా సాష్టాంగదండనమస్కృతులం గావించి 'తల్లీ! మున్ను నరకుండు హరించిన భవత్కర్ణకుండలంబులివె కొనివచ్చితి. కైకొనుము' అని యొసంగి వారు పునః ప్రమాణంబు సలిపిరి.

అంత నయ్యదితి మహాదేవి పాదావనతులగు నాదంపతుల లేవందీసి పరమానందంబున దీవించి చింతామణిపీఠంబున, దనచెంగటఁ గూర్చుండఁ బెట్టుకొని మేనునిమిరి శిరంబు మూర్కొని 'కుమారా పరమయోగులు! కనుఁగొనఁజాలని నిన్నుఁ గుమారునిగాఁ గంటి. నాభాగ్యం బెన్నఁదరమె? నా దురితజాలంబులు నిర్మూలితంబులయ్యె. నేఁబరమ ధన్యనైతి. కృష్ణా! నీవు మున్ను వేదముల హరించి వారిధిం దూరిన సోమకాసురు నడంప మత్స్యమూర్తివైతివి. అమృతోత్పాదనంబునకై సురాసురులు మథించునెడ మందరనగం బంబుధిం బ్రుంగఁ దదుద్ధరణమునకై కూర్మరూపుండవయితివి. హిరణ్యాక్షుండు పుడమిని జాపకైవడిఁ జుట్టి వార్ధిముంప వానిం దుంపనాదివరాహంప నైతివి. ప్రహ్లాదునిం గావనెంచి స్తంభంబునం బొడమి హేమకశిపుం జంప శ్రీనృసింహమూర్తివైతివి. త్రిదివం బాక్రమించిన బలిని బంధించి నాకంబును బాకారికిడ నెంచి వామనరూపుండవైతివి, దుష్టక్షత్రియుల హరింపఁ

బరశురాముఁడ వైతివి, రావణాది లోకకంటకుల వధింప శ్రీ రామచంద్రుండ వైతివి, ఇపుడు నృశంసులగు కంసాదుల హింసింప శ్రీకృష్ణావతారముం దాల్చితివి. మహాత్మా! నీమహిమ నెంచ నాకు వశంబె, ఇట్టినిన్నుఁ గుమారాయని పిలుచుకొను నాభాగ్య మేమనవచ్చు! ధన్యాస్మి ధన్యాస్మి యని పలువిధంబుల వినుతించి 'సాత్రాజితీ! యిట్టి పరమపురుషుని వరునిగాఁ బడసిన నీదు భాగ్యంబెంత యొప్ప'నని సత్యను మెచ్చుకొని కుమారా! నేఁడు మీరిందధివసించి యెడ తెగని మీస్వరూప దర్శనానంద భాగ్యము నాకనుగ్రహింపుండన వల్లెయని యారేయి వారచటనే సుఖంబుండిరి. శచీదేవి యొనర్చుఁ గౌరవంబునకు సత్య తుందిలానందయయ్యె, వారు గోష్ఠీవినోదంబుల సుఖనిద్ర జెందిరి.

## శ్రీహరి వామనావతారము

శ్రీకృష్ణుఁ డదితికిఁ బుత్రుఁడగుటయు, నిందుఁడన కనుజుఁడగుటయు నెట్లన- బ్రహ్మకల్పమున మున్ను పృశ్నిసుతపులను పరమ దంపతులు సంతత నిష్ఠాగరిష్ఠులై శీతవాతాతపంబుల కోర్చి శ్రీమదాది నారాయణుం గూర్చి పండ్రెండువేల దివ్య హాయనంబులు తపంబొనర్చిరి.

వారి తపశ్చరణంబున కవ్వరదుండు ప్రముదిత హృదయుండై కోటిసూర్యసమ ప్రభా భాసమానంబగు కిరీటంబు శిర స్తటంబునం దులకింప శంఖచక్రాది దివ్యాయుధంబులం దాల్చి, చతుర్భుజుండును, హారకేయూరాది భూషణభూషి

తుండును, వనమాలావిరాజితుండునై నీలమేఘంబుం బోలు సుందరశరీరంబుతో వారికి సాక్షాత్కరించి, వారి భక్తియుక్త స్తోత్రంబుల కలరి వరంబుఁ గోరుఁ డిచ్చెదననియె. వారానంద తుందిల హృదయులై మోక్షముఁ గోరక, సంతానము లేమిం జేసి, 'దేవా! నినుఁబోలు పుత్త్రుననుగ్రహింపుము' అని వేఁడిరి. వారి కవ్వరంబిచ్చుట కంగీకరించి తన్నుఁ బోలినవాఁడు మఱి యొకండు లేకుండుటచే హరి పృశ్నిగర్భుండను పేర వారికిఁ దనూజుండయ్యె. పిమ్మటిపుట్టువున నాదంపతు లదితికశ్యపు లను పేర జన్మించి దేవేంద్రుఁడు సూర్యుఁడు మొదలగు ననేక పుత్రులం గని దేవసంతతిని వృద్ధిపఱచిరి. బహు కాలము కడచినది.

పిమ్మట భూతలంబునేలు బలి యను రాక్షసచక్రవర్తి నిజ పతాపాతిరేకంబున నింద్రుని బాఱఁద్రోలి స్వర్గమును దనవశము చేసికొనియె. అపు డమరవిభుండు దనుజ భయంబును బాపి దివంబును దన కిప్పింపుండని వేఁడ శ్రీహరి యభయం బొసంగి యపుడు మానవలోకంబున నధివసించుచున్న యాయదితి కశ్యపులకు వామనుండను పేర నవతరించె. తలిదంద్రులు సకాలంబున నుపనయనంబు సేయ వామనుం డఖిల విద్యలం గ్రహించి నిజ కార్యంబు సాధింప నెంచి యయ్యెడ జన్నం బొనర్చు బలిమఖంబున కభ్యాగతుండై యేగె. బలి యతని సంభావింప నాగుజ్జువేల్పు పాదత్రయ మాత్ర భూదానమిడుమని కోరెను. ఆ వదాన్యశిరోమణి యట్టి స్వల్ప

దానం బిడుటకు సంశయించియు యాచకుని యిష్టానుసారి ముగా భూదాన మొసంగ నిష్టపడి, యాచార్యుఁడగు శుక్రుం డట్లొసంగుట చేటగునని బోధించినను వినక వామనునకు దాన ధారవోసె. దానంబు కైకొని పొట్టివడుగు పెచ్చు పెరిగి యొక పాదంబున భూతలంబును, రెండవచరణంబున నాకసంబు నాక్రమించి, మూఁడవపదంబున కవకాశంబుఁ జూపుమన బలి తృతీయాంఘ్రినిఁ దన శిరంబున నుంచుఁడనికోరె. హరియట్లొ నర్చి కరుణించి బలికిఁ బాతాళరాజ్యంబునకు శాశ్వతాధి పత్యం బొసంగి యింద్రునకు నాక రాజ్యమొసంగె. మూఁడవ జన్మంబున నయ్యదితి కశ్యపులు దేవకీవసుదేవులు గాఁగ వామనుండు పిమ్మటిజన్మంబున శ్రీకృష్ణుఁడై యవతరించె. కావున జన్మాంతరవ్యవస్థచే నింద్రకృష్ణులు సోదరులైరి.

కృష్ణుండారేయి సత్యకు వైజయంతీ భవన విశేషంబులఁ దెల్పుచు నిద్రించి యుదయంబునలేచి సత్యయుం దానును విధ్యుక్తంబుల నెఱపి వనంబు నవలోకింపనుద్యుక్తులైరి. అపు డింద్రాజ్ఞచే రంభ ఊర్వశి మేనక తిలోత్తమ మొదలగు నచ్చ రలు నర్తనంబుల సలుపుచు, భృత్యులు సర్వోపచారంబులఁ జేయుచు వెంటనేతేర సత్యాకృష్ణులు తత్పురచిత్రంబులఁ జూచుచు బయలు వెడలిరి. అపుడు సత్య మధురాలాపంబు లతో 'మహాత్మా! యీత్రివిష్టపంబున నెన్నఁడు నెవ్వరెఱుంగని పరమాద్భుత విశేషంబులు గలవందురు. వానినెల్లఁ జూపి నా

యభీప్సితంబు నెరవేర్పుఁడని వేఁడఁ దత్తత్ప్రదేశంబులఁ దద్విశేషంబులఁ జూపుచు హరియిట్లనియె.

సీ॥ యక్షులు వీరలోయతివ మేళముగూడి
పాడుచుందురు దిక్పాలసభల
గుహ్యకుల్ వీరలోకొమ్మ హాస్యరసాధి
నాయకుల్ భృంగీశ నర్మసఖులు
గరుడులు వీరలోతరుణి విష్వక్సేన
పరిచితుల్ నాగాది పరిమహితులు
చారణు ల్వీరలోసతి విచిత్ర కథేతి
హాసజ్ఞు లఖిల లోకాధ్వ నీను
లమరపతిఁ గొల్వఁజనువార లతివ యొప్పు
నుబుసుపుత్తురు వివిధోప యోగ్యకళల
మనలఁ జూచెద రాశ్చర్య మగ్నులగుచు
వీరిఁ గనుగొంటె గంభీరవేది గమన !

ఇటులఁ దెలుపుచుఁ జని ఘోరదురిత పరిహారకంబును, సర్వశుభదాయకంబును నగు మిన్నేటం గృతస్నానులై పునరలం కృతులై తత్తీరంబునఁ జెలువొందు నందనోద్యానముఁ బ్రవేశించిరి.

అవ్వనంబు సర్వర్తుపుష్పశోభితంబులగు వివిధ తరువిసరంబుల విలసిల్లుచు నేత్రపర్వంబై యుండె. అందొక్కయెడ వజ్రమణి ఘటితంబులగు దిగుడుబావులం గల సువర్ణకమల డోలికల నూఁగుచు సువర్ణపక్షంబులగు రాయంచలు మదుర

గాన రవంబుల సలుపుచుండె. ఒక క్రేవఁ జెట్లనుండి రాలు పండుటాకుల మర్మర ధ్వానంబులు చెవుల కింపు నింపుచుండె. ఒకపట్టున విద్యాధరాంగనల సంగీత మృదంగ ధిమిం్ధిమి ధ్వనులు హృదయపారవశ్యం బొనర్చుచుండె, ఒక్క చక్కిఁ జక్కని తరుబృంద మకరంద ధారాసారంబులు ప్రవహించు చుండె. ఒక్క తట్టున దట్టమగు హోంబట్టు క్రొమ్మావి చెట్టుల నీడపట్టునం బవళించి కామధేనువు సోయగంబుగా నెమరు వేయుచుండె. దాని రామణీయకము, సారతర శోభా పరిభావము, దాని పరమప్రమోదకరణ ధురీణసరణి మఱియే లోకంబున నెవ్వానంబునకును లేదు.

—— ♦ కృష్ణుఁడు సత్యకుఁ బారిజాత మహిమను జెప్పుట ♦ ——

ఆసతీపతు లందలివినోదంబుల కచ్చెరువందుచు, ఘ్రాణ తర్పణం బిడుచు మాంద మలయ సౌరభ శోభితంబులగు వాతపోతములం జొక్కుచుఁ జనఁజన, ముందట పారిజాత తరు రాజ కుసుమవాసనలు చెలరేఁగి యెన్నడు నెఱుంగని వింత వింతలగు నద్భుత పరిమళసంతానంబుల వెల్లిగొలుప, నాసత్య భామ బ్రహ్మానందాబ్ధి నోలలాడుచు మహాయోగి కరణి నిశ్చేష్టయై మైమఱచి కొంత తడవునకు స్మృతిం దెచ్చుకొని 'ప్రాణేశ్వరా! యెక్కడి దీయద్భుత పరిమళంబు నన్నానంద వివశను జేయుచున్న'దనఁ గృష్ణుండు సత్యమోమును దువ్వుచు నిదియె పారిజాతకుసుమ సౌరంభంబని యిట్లనియె.

చిలుకల కొలికీ! రమాకాంతు నురంబునఁ గౌస్తుభంబు

తెఱంగున, నుమాకాంతు శిరంబున జాబిల్లి వడువునఁ జెలువొందు నీమందార తరువు సురలోకంబున కలంకారభూతంబు. ఇందువదనా! దీని రత్నకుసుమస్తబకంబుల మరందము నాని మిళింద బృందములు తుందిలములై యెందును జనక యుండే వర్తిల్లుచున్నవి. చూడుము. లోకములోని యెల్లతరువులం బాయు విరులు నీధరణీ రుహంబున నే పొడముచుండును. వన విహరణంబున నలసి సొలసిన వేలుపుల వెలందు లీసంతానంబు చెంతఁ జేరి రేని యావంతి యావంతయేని గన్పట్టదు. దీని చెంగటనున్నచో నుష్ణకాలంబున శీతంబుగా శీతకాలంబున నుష్ణంబుగ నుండు. దీని నాశ్రయించినవారలకు మనఃకాంక్షితము లెల్ల నిది నిమిషమాత్రంబునఁ జేకూర్చును. దీని మహిమం బింతయన పొగడ నలవిగాదు. వినుము.

ఉ॥ వారణరాజయాన సురవల్లభుఁ డాశచినంక పీఠముం
జేరిచి సోగవెండ్రుకల చిక్కులు వాపి వియన్నదీనవాం
భోరుహనాళ సూత్రములఁ బొందుగ దీనిలతాంతము ల్సరు
ల్గారచియించినించుఁగుతుకంబున వీగు మెఱుంగుఁ గ్రొమ్ముడిన్

ఇట్లు సత్యకాముఁడు నుడువు నెడ సత్యభామయింతింతన రానిసంతసమ్మున మొగమునఁ జిఱునగవిగురొత్త "ప్రాణేశ్వరా యింక నాలసింపనేల? వేగిరంబ పారిజాతంబుం బెకలించి మద్గృహ వనవాటిక నాటించి దాసురాలి కిడిన వాగ్దానము సెల్లింపుఁడన నమ్మురారాతి తలోదరీ! యట్లయొనర్చువాఁడ నని చారుతరంబగు దాని రత్నగుచ్ఛ మొకదానిగె కొని యా

యువిద చెవియుం దలంకరించె. అక్కృతంబునంజేసి యాచక్క-
రబొమ్మ చక్కదనంబున కొక్కవింత చక్కదనంబు పిక్కటిల్లె
అంత నాయదువల్లభుం డాపల్లవపాణియుల్లంబు పల్లవింపఁ
బారిజాతాపహరణోత్సుకుండై భక్తరక్షణ ప్రశస్తంబగు
హస్తంబున నానిస్తుల తరువుం బెకలించె. అప్పుడప్పారిజాతంబు
భక్తపారిజాతంబు తన్ను వెంటఁగొని పోవుచున్నాఁడను సం
తోషమ్మునఁ బులకాంకురిత మయ్యెనో యనఁ గంపిత శాఖ
మయ్యె. ఇదేమిపక్షపాతమో తరువుం గొని తరువు నాశ్రి
యించియున్న మమ్ముఁ బైకొనం దయ్యెనని యొరులతో
మొరలిడఁ బోయెనో యన ఖగంబులన్య నగంబులం జేరె.
కృష్ణా మమ్ముం గూడఁ గొనిపొమ్మని ప్రార్థించు చున్నవో
యనఁ దుమ్మెదలు రవమ్ము సేయుచుఁ ద్రిమ్మరుచుండె. ఇదె
కృష్ణుండు మన ప్రాణవిభుం గొనిపోవుచుండె నని చలంబునం
గొనిపోనీక పెనంగుచుండెనో యనఁ జుట్టును జుట్టిన తీవియలు
విడువకుండె. ప్రాణవల్లభలు ప్రాణవల్లభు నెడఁబాయఁజాలరు
గదా! ఇట్లమ్మహీరుహంబు నెకలించి గరుడుని ఱెక్కలపయి
నిలిపి ప్రయాణంబు సేయ నుంకించుతఱి వనపాలకు లరు
దెంచి యిట్లనిరి.

## ఇంద్రుఁడు కృష్ణునిపైఁ గోపించుట

యదువల్లభా! నీవు ధూర్తుండవై యీసురతరుతల్ల
జంబు హరించి మమ్ము వంచింపఁ దగునె? మామహారాజు దీని
కుసుమకిసలయంబులచే శచీదేవికి నిత్యంబుఁ బ్రియమొనర్చు

చుండు. మాయొడయండు వినెనేని నీపనికిఁగోపింపక నైచునే? యనుచు నష్టంబురా సత్య కృష్ణుని గనుసన్నల వారించుచు మందహాస సుందర వదనారవిందయై వారలకిట్లనియె.

వనపాలులారా! మున్ను పాలసంద్రంబునఁ బొడమిన యీచెట్టుం గొని పోవనీకుండుట కింద్రుఁడెవఁడు? అడ్డగించుటకు మీశచీదేవి కేమియధికారంబు కలదు? ఇది వీరుల సొమ్ము గాని మీవ్వారల సొమ్ముగాదు. దీనితోఁ బుట్టిన లక్ష్మీకౌస్తుభంబు లేమహానీయు నాశ్రయించెనో యీవృక్షంబు గూడ నాదక్షునింట నిలదుఁగాత. మీశచీదేవి వీరపత్ని యగునేని దనపతి నీసత్యాభామాపతికడకంపి శక్తుండయ్యేనేనిఁ గొంపోవఁ డగునని యంటినని నుడువుఁడు. అను నమ్మెచ్చకంటి పలుకుల కచ్చెరువడి మాఱాడన్నోపక వారా వియచ్చరపతికడకువచ్చి సర్వంబు నివేదించిరి.

పాకశాసనుండమ్మాటలకుఁదోఁకద్రొక్కినత్రాఁచువలెఁ గోపంబు దీపింప రక్తారుణితలోచనుండై, 'ఔరా కృష్ణుండెంతపని సేసె. ఏనునీసహోదరుండ, నినుఁజూడవచ్చితినని నిక్కంబు మిత్రుండువోలె నిచ్చకంబులాడి యింతపనిసేయనెంచెగా! ఇంట దిని యింటివాసంబులు లెక్కించెనన్నట్లు నాయొనర్చిన గౌరవంబునైనఁ బాటింపక యిట్లొనర్చె. పసులగాయు నవనీతచోరునకు మర్యాద యేమి తెలియును? నావజ్రంబుచేవ యెఱుంగడుకాఁబోలు! గరుడుండైన మదీయకులిశప్రతాపంబు నెఱిగింపఁడొక్కొ! ఆసత్య సిగ్గువిడచి పౌరుషోక్తుల నిట్లుతూలనాడెనే?

ఎంతమాటవింటిమి. మంచిది కానిమ్ము వారిపౌరుషముఁ జూచెదఁగాక యని, ముందున్న శచీదేవి మొగము వెలవెలపాటును ధైర్యోక్తులనడంచి సత్యాగర్వంబునడంచివచ్చెద నని లోనికిబంచి శుద్ధాంతగృహంబువాసి సుధర్మా సభామధ్యంబుఁజేరి దిక్పాలురంగాంచి

చూచితిరే! యీయాదవునిచర్యలు. తానఁట మన పారిజాతమును గొనిపోవువాఁడఁట! ఏమి యీగర్వము. నీసోదరుఁడ సఖుండ నని మిథ్యాలాపములువల్కి తుదకీపనికింబూనినాఁడు. ఆతఁడు గోముఖవ్యాఘ్రము పయోముఖవిషకుంభము. వానినిందుఁ జేరనిచ్చుటచే నింతవచ్చె. చూతము కానిండు. మీరందఱు నాయుధపరివారసమేతులరై కృష్ణునింబొదువుఁడు వానిశక్తి యెఱుంగఁబడుఁగాక' అని వేయికన్నులు జేవురింప దంభోళిని నిజకరాంభోజమునఁబట్టి తట్టుచు గంభీరభాషణంబులనుడివె

భస్మాసురుని చరిత్రము.

ఏమి యింద్రుని సాహసము! తానుమున్నాకృష్ణునివలన నెన్నియోఁ యుపకారములంబొందియు, గృష్ణునిబలసామర్థ్యములనెఱింగియు నపుడు వాని నన్నింటిమఱచి; తనచే నార్జింపఁబడని చెట్టును గొనిపోవుచుండనాగ్రహించి నిజపరబలంబెఱుంగక తుదకు యుద్ధమునకు సాహసించె. ఆశ మంచిచెడ్డలనెఱుంగనీదుగదా! మున్నుభస్మాసురుండు తనశక్తినెఱుంగక వరప్రదాతయగుశివుని జెఱుపఁదలంచితుదకుఁదాదగ్ధుండయ్యె. ఎట్లన

మున్నుభస్మాసురుండనువాఁడు దర్పాతిరేకంబున గన్ను

మిన్నెఱుఁగక సుజనుల బాధింపుచుఁ గడు దుష్కృత్యంబు లొనర్పుచు మిగుల దుష్టుఁడై ప్రవర్తించుచుండె. అతం డింతింతనరాని శరీరబలంబున వీరాధివీరుల నెల్లమించి బాల్యమాదిగాఁ గొండలం బట్టి బంతులవలె నాడుచుండు. కులపర్వతముల బొంగరముల వలెఁ ద్రిప్పుచుండు. స్వచ్ఛందవృత్తితో వాఁడు సంచరించుచుండ దూరంబునం గాంచియు దేవతలు ముసుకులు వేసికొని మూలల దాఁగుచుండుదురు. అతని యాధిపత్యంబుఁ జూచిన జగమంతయు గజగజ వణఁకవలసినదియే. లోకద్రోహు లిట్లు ద్రోహమొనర్చుచుఁ దమశక్తిని సన్మార్గమున నుపయోగింపక పుణ్యసంపాదితమగు జన్మమును నిరర్థకముగాఁ జేసికొందురుగదా !

మహాబలవంతుఁడయ్యు నతఁడు తపంబుఁ జేఁదనశక్తిని మడింపఁ జేయ నగునని కోర్కెనూనె. తుదకు శివునారాధించి వరంబుఁ బొందవలయునని యుగ్రతపం బాచరించె. మున్నెన్నఁడు నట్టి ఘోరనియమంబులతోఁ దపం బాచరించిన వారు లేరు. ఆతండు పెక్కువందల సంవత్సరము లేకాగ్రమనస్కుండై సమాధినిష్ఠనుండె. వాని నియమంబున కచ్చెరువంది గౌరీవల్లభుండు ప్రసన్నుండై 'ఓయీ! మెచ్చితి. కోరుకొమ్ము నీవేడిన వరంబు లిచ్చువాఁడ'నన నాదుర్మదాంధుం డొండు వరంబెద్దియుఁ గోరక 'నేనెవని శిరంబునఁ గరంబుంతునో యాతఁ డపుడ భస్మంబు కావలయు. ఇట్టి వరంబొసంగుఁడన నయ్యీశ్వరుం డట్లేయగుఁగాక యనియె. అంతనా రక్కసుండు యుక్తాయుక్తంబులఁ బరికింపక మహేశ్వరా! నీవరంబునం గల యాథార్థ్య మవ

లోకించెద.ఏది మస్తకంబువంచుము నా హస్తంబునుంచువాఁడ ననిపలికె.

గీ॥ కొన్నిదినములుండి ♦ గురుమదంబోనరించు
యౌవనంబునఁ ♦ దురాత్ములెపుడు
తమదుజన్మ వ్యర్థ ♦ తరముగాఁగ మహాప
రాధముల నొనర్తు ♦ రీధరిత్రి

ఆమృత్యుంజయుఁడు వానికి మృత్యువాసన్నం బగుట యెఱింగి దానికి వెఱచినవానివలె నెద్దియుఁ జెప్పక బిరబిర పరుగెత్తఁదొడఁగె. ఆభస్మాండను సూర్యునిగబళింప నేగురాహువగిది నా దేవదేవు వెంటనంటి పాఱుచుండె. శంకరుండు కడు దూరంబరిగి మఱింత వెఱపు గొన్నవాని కరణిఁ బెద్దదాటులఁ బిక్కబలంబుసూపె. దానవుండు నిలునిలుము పోకు పోకు ఇట్లసత్యవరంబులిడి లోకులమోసగించు నీవెందుఁ జొత్తువు.వారిధిం జొరఁ బాఱినను నిన్నువిడువ? తారామండలమున దూఱినను నీపీచంబడఁచెద. చావు దప్పించుకొన నెంచితివి కాఁబోలు. నిను బ్రతుకనీను ఉండుండుమని తరిమి నీడపోల్కి వెన్నంటి పాఱుచుండె. అయ్యెడ శ్రీమహావిష్ణుండు సామాన్యజనవేషంబుతో నాతనికడ్డంబువచ్చి 'రాక్షసేశ్వరా! యెందరిగెదవు.ఈయాడంబరమేమి? నిన్నుఁబరుగులువాఱఁజేయు విక్రమవంతుఁ డెవఁడుగలడు? నాకుఁ దెలుపుము తగునుపాయము చే నీమనోరథము సఫలము గావింతు' నని నావంచకుఁ డతని మోసము నెఱుఁగక స్వపక్షమువాఁడని తలఁచి తద్వృత్తాం

తెంబంతయుఁ దెలిపి యీతండీశ్వరుఁడగునేని, యీతని వరం
బు యథార్థమగునేని వీనినే పట్టిపెట్టెద వీనిశక్తి నారసెదఁ
గాక యని వెడలుచుండ హరి యిట్లనియె.

రాక్షసోత్తమా! నీవుచేసినపని బాగుగానున్నది. ఇది
నాకుఁగూడఁ బరమసంతోషము. కాని యందులకు నీవొక
పనిచేయవలయును ఎద్దియన ఏరికైనను బరిశుద్ధులు గానివారి
కీదేవుని దాఁక నశక్యంబు. నీవు స్నానంబొనర్చి నిర్మలుండవై
యరిగినచో బట్టువడక యాతఁడెందేఁగఁగలఁడు? అటులఁ
జేయుమన నాతండియ్యకొని క్రోధావేశంబున నేగుచుండ
ముందటనొక విశాల సరోవరంబు నేత్రగోచరమయ్యె. ఆద్రో
హకారి యందవగాహనంబుసేయ సమకట్టిదిగెను. అది మహా
విష్ణు ప్రేరితముగాన నందుజలంబు మోకాలి బంటిగా నుండె.
ఆదుష్టుం డందు మునింగి భుజంగభూషణుం బట్టనెంచెను గాని
సలిలంబులల్పంబులగుటచే వాని కరంబునఁబట్టి శిరంబునఁ
బోసికొనవలసె. అటులొనర్చుచుఁ బ్రారబ్ధకర్మంబునంజేసి
తాను తన సంగతిమఱచి యయ్యుదకంబులఁ బయింబోసికొ
ననెడఁ దన పాణితలంబు తలకుం దగుల వరప్రభావంబునం
జేసి యాభస్మాసురుండు భస్మావశేషుండయ్యె. మేలుచేసిన
వారలం జెఱుపఁదలఁచువారు తుదకుఁ దామెచెడుదురుగదా!

—— ♦ ఇంద్రుని యుద్ధ సన్నాహము ♦ ——

'చెట్టుచెడు కాలమునకుఁ గుక్కమూతి పిందెలనినట్లు
అనమానము సిద్ధింప నున్న యవ్యాసపుండు వాసుదేవునితోఁ

గలహింప సంసిద్ధుండై యోధుల కాజ్ఞ నొసంగెను. అంత సుర గరుడోరగ సిద్ధవిద్యాధర గంధర్వాదులెల్లఁ బరశు ముసలభిండి వాలాద్యాయుధంబులం గొని నిజవాహనంబుల నధిరోహించి యుద్ధసన్నద్ధులై యేతెంచిరి. పౌరులెల్లరుఁ గృష్ణచర్యను విని 'ఔరా! నవనీతచోరుండు నిక్కంబుగఁ జోరుండేయనుచు సమరపరికరంబుల గూర్చుకొని యీమోసగాని బీరంబడంతుమని యార్పుచుఁ బేర్చుచు వీరావేశంబున వచ్చి మహేంద్రుని మ్రోల నిలచిరి. అగ్ని యమ నిర్మృతి వరుణ వాయు కుబేర రుద్రు లలంకృతములగు వాహనముల నెక్కి రణరంగంబునకుఁ జేరిరి. ఇంద్రుఁడును మహోద్దండంబగు కోదండంబూని యైరావత వేదండంబు నధిరోహించివజ్రపాణియై వీరపరివారంబుతో సమరాంగణంబు దరిసి పారిజాతముతో సత్యభామా సహితంబుగా నేగనున్న కృష్ణుని బోకుపోకుమని గద్దించుచు.

ఇంద్రుఁడు—కృష్ణా నీవుచేయుచున్న యాపని యేమి?

కృష్ణు—అగ్రజా! యీనీమఱఁదలు కోరుటంజేసి పారిజాతమును మహీతలమునకుఁ గొంపోవుచున్నాఁడ

ఇం—ఏను నీవు సోదరుఁడవని నీయెడఁ గల కూర్మిచే నెట్టివారికిం జూడరాని నావైజయంతీ భవనమున విడియించినందులకా యిట్టిపని సేయుచున్నావు?

కృ—అన్నయ్యా! నీరాజ్యమును హరించిన బలిని వంచించి దాని మఱల నీకిచ్చితిఁ గదా నీమఱఁదలి కోర్కె నింతమాత్రము తీర్పఁజాలవే?

ఇం—కృష్ణా! ఈనీ మాయమాటలం జాలించి తరువటను
చుము. నీబూటకము లమ్మానవుల యెడ సాగును గాని
మాయొద్దం గాదు.

కృ—సోదరా! మానవ్రులనంత త్రోసివేయనేల? నీవు మున్ను
మానవలోకంబునంబుట్టి శతక్రతువు లొనర్చి దేవ
తృప్తిచేసి కదా యింద్రుండ వైతివి. ఇప్పుడది బుద్ధిం
దలంపవే?

ఇం—నీవు మహాత్ముండవని నారదుండు నుడువ గౌరవించితిని
గాని పాములం బట్టు వానిబుద్ధి నీకబ్బుట యెఱుంగ.

కృ—సురేంద్రా! ఘాతుకుండగు కాళియుని మర్దించి గోగోప
రక్షణ మొనర్చితిం గాని లుబ్ధబుద్ధి నెఱుంగని నన్ని
ట్లనం బాడియే!

ఇం—పసులం గాయుచు వెఱ్ఱిగొల్లల చెలిమి సేయు వారు
మర్యాద నెఱుంగ రనుట నీయెడ స్పష్టమయ్యె నీకిం
జాలు లెమ్ము.

కృ—నాకు మర్యాద లేదనుట సత్యంబయగుంగాక! దేవతా
ప్రభుండవను నీమర్యాదను నిలుపుకొనుము.

ఇం—నీనయగారవు మాటలు ముగ్ధలగు గోపకామినుల ముం
దర చెల్లింపుము. నాయొద్ద సాగవు.

కృ—అన్నా! గోపకామినులా వారు భర్తృరాంద్రు భక్తకాం
క్షితములనేం దీర్చకున్న మఱి తీర్చువారెవరు?

ఇం — భక్తురాలనియే కాఁబోలు శిశుపాలుఁడు పెండ్లియాడ నున్న రుక్మిణిని దొంగిలించితివి.

కృ — రుక్మిణిని నాకిచ్చుటయందే యామె జననీజనకుల ప్రథమోద్దేశము. వారును భక్తులే.

ఇం — ఔను పదియాఱువేల గోపకుల కాపురములు చెడ్చిన నీకు భక్తులు కానివా రెవరు?

అనిపలుక "వీని కజ్ఞానంబు వదలలేదు. ఈతనికి నీతిఁ దెలుపుట పామునకుం బాలుపోయుట యయ్యె ఇంకఁ గట్టిగా బోధించెదనుగాక" యని యాలోచించి.

కృ — అగ్రజా! వామనావతారంబున నీవు నాకంటెఁ బెద్దవని విధేయతఁ జూపినను దెలియవైతివి. ఇఁక నీ మాటఁ బాటింపఁదగదు వినుము"

క|| ఉడుగక కార్యాకార్యము
లెడదంబరికింప నెఱుఁగ కేపన్నులైనం
జెడఁ జేసెనేని వానిం
దడయక గురునైన విడువఁదగు నేభంగిన్.

ఇం — గోపికాజారునకుఁ బాటింపఁదగిన దెద్ది? ఇఁక నీధర్మపన్నములఁ గట్టిపెట్టి పారిజాతము నచట నుంచుము.

కృ — ఓయీ! అహల్యాజారా! నీవు ధర్మజ్ఞుండవగుట చేతనే గాఁబోలు. పారిజాతము నుంచుమనుచున్నావు. సముద్రసంభూతమగు నిది నీ దెట్లయ్యెనో చెప్పుము.

ఇం — సహస్రాక్షు నెదుట నూరక ప్రేలక జాగరూకుఁడవై వర్తింపుము.

కృ — ఔను, నీవు సహస్రాక్షుఁడవగుట నేనెఱుఁగనిది కాదు. ఇప్పుడే పారిజాతమును గొంపోవుచున్నాఁడ. ఏమిచేయఁ గలవో చూచెదఁ గాక.

ఇం — లెక్కలేని కొండల ఱెక్కలఁ ద్రుక్కడంచిన వజ్రాయుధము మిమ్ముం గదలనీయదు సుమీ.

కృ — ఏదీ చూతము. నీవజ్రమున కిపుడంత శక్తివచ్చెనా? కానిమ్ము.

ఇం — సిద్ధముగ నుండుము, దిక్పాలురు నిన్నుఁ గవియుచున్నారు.

కృ — (నవ్వి) దిక్పాలురేకాదు. ముల్లోకములొక పెట్టునఁ గదసినను......వర్షధారలు పర్వతము నేమిసేయును.

—— యుద్ధము ——

కృష్ణుని వాక్యసార మెఱుంగక కండకావరమున వృత్రారి హరితో ననిసేయ సేనల కానయిడెను. రణదుందుభులు మ్రోయింపఁబడియె. సుపర్వులెల్లరు లక్ష్యంబుఁ దొలఁగనీక లక్ష్మోపలక్షులుగా హరిపై శరనికరముల గురియ సాగిరి. ఇంద్రపరాజయమున కెదురు చూచు గరుడుఁడు తరువుడించి కృష్ణాజ్ఞచే గీర్వాణబాణంబులఁ బొడిపొడి గావించుచుండె. కిన్నరకింపురుషాదులు కుంతతోమరాదుల నిగిడించుచు వైనతేయుని ఱెక్కలపోటునకుఁ బాలైరి.

సుపర్వుండు పాదంబులంబట్టి సురవిసరశిరంబుల బంతి యాడుచుండె అయ్యెడ సత్యభామ తానుగూడ సంగ్రామకౌశలముఁజూప సంసిద్ధయగుడుఁ గృష్ణుండది చూచి 'ప్రేయసీ! యింతమాత్రమునకే నీవు పయాసం పడనేల? పారిజాతము చేరువంగూరుచుండి కోరికలందీరుచుకొనుచుమా చెయిదంబుల వీక్షింపుచు-నుము' అనినివారింప నాచంపకగంధి నిలింపతరువిరుల సొంపుసొంపును నిరీక్షింపుచుండె. అపుడు యమవరుణాదిదిగీశులు సాహంకారులై సింహనాదంబులుసలుపుచుఁ దమ యాయుధంబుల మెఱయించుచు నాయోధంబునకుఁగడంగిరి. విష్టరశ్రవుండశ్రమంబున నిజబాణాగ్ని జ్వాలాజాలంబులచే వారిబాణంబుల వారికణంబులభాతి శమింపజేయుచుండె. ఎందఱెన్నెన్ని శరంబులఁ దనపైఁబరపుచుండిరో నందకపాణి తానందఱ పైనన్నిన్ని తూపులనేయుచు వానినడుమనఁబొడిపొడి గావింపుచుండె. పదియాఱువేల గోపకాంతలయిండ్లఁ బదియాఱువేల కృష్ణరూపములం బ్రవర్తించు పరమేశ్వరుఁడు దురమునకేతెంచిన నిర్జరసంఘములయెడ నన్నియాకృతులతో యుద్ధమొనర్చుట యేమి యబ్బురము?

హరి యొక్కరుండయ్యు నందఱతోరణంబు సలుపుచుండె ఆనీలగాత్రునికోమలగాత్ర మిసుమేని గసుగంద లేదు. త్రిదశులకూర్మినారాచము లానారాయణునిశరీరమున దూఱ లేదు. చిరునగవానగధరుమొగమును వీడలేదు. ఆమహాహవమామహామహునకు లీలావినోదము. దేవతలతోఁ బెనంగుట

యాయనంగజనకునకు రాసక్రీడయే. ఆయకలంకునకా మేలం
కువ బోధనాపద్ధతి, ఆసర్వేశ్వరున కా సంగ్రామప్రచారము
శిక్షావిధానము, రణక్రియానైపుణ్యమును దనమహిమ చూపు
టయేగాని యాలోకాధినాథునకు వారియెడఁ గోపములేదు.
దిగీశులు శౌరితోఁబోరఁజాలక నిశ్చేష్టులైరి అప్పటికి నాఖండ
లుండాసర్వశక్తిమయునిశక్తి నెఱుఁగఁడయ్యె ఇంకను క్రోధ
మాపురుహూతుని చేతమునుండి జాఱలేదు. ఇంతయేల?
అజ్ఞానమాయింద్రుని విడువలేదు కృష్ణుఁడు పరమేశ్వరుఁ డను
బుద్ధి తోఁపలేదు. శత్రుఁడెట్లయినను జయింపవలెనని పెనంగు
లాడుచుండెను. ఆఁపరానికోపమున నాపురుహూతుఁ 'ఓగో
పాలా నీపలలవహారగింప నిదె వజ్రము వచ్చుచున్నయది కాచు
కొమ్మ'ని శితకోటియగు శతకోటిని గిరిగిరం ద్రిప్పి ఱెప్పరము
గనేసె. ఆదంభోళి ప్రళయకాలంబున ద్వాదశాదిత్యులేకాకార
మున వచ్చినయట్లు మండిపడుచు భుగభుగారవంబుల హోరింగ
బళింపనేతెంచె. కృష్ణుఁడు భయపడలేదు. తత్తరమందలేదు.
ప్రత్యాయుధమునైవలేదు; జగన్మోహనసుందరానన పరిపూర్ణ
చంద్రబింబమున మందహాసచంద్రికలుచెలరేగ నేనుఁగు తొం
డంబునఁ దామరతూండంబోలె భక్తరక్షణప్రశస్తంబగు నిజహ
స్తంబున నమ్మహాదంభోళి నొడిసిపట్టె, అయ్యశనియు బరమా
త్మునందునిలిచినచిత్తంబుకైవడినిశ్చలంబై యుండె. తననుమించి
నవానిపైవచ్చుకోపంబుభాతినింద్రాయుధంబు నిష్ప్రయోజనంబ
య్యె. అయ్యదిగని సురగణములువెఱచి పరువడిఁ దుగులిడిరి.

సీ॥ తలలువీడంగ విద్యా ♦ ధరుల్పఱవిరి
గగ్గులకాఁడ్రైరి ♦ ఖచరవరులు
చట్టుపైఁబోఁకలై ♦ చనిరి గంధర్వులు
గరుడులుపం ♦ చ బంగాళమైరి
కన్నదిగతిగాఁగఁ ♦ గిన్నరులరిగిరి
పన్నగేంద్రులు పటా ♦ పంచలైరి
పోయినపోకలై ♦ పోయిరి సిద్ధులు
దిక్కుమొకములైరి ♦ దిగధిపతులు
గీ॥ హరిహయత్రాణనా యత్తు ♦ లగుచు వచ్చి
మునులు సంప్రార్థనా వచో ♦ ముఖరులైరి
పూనితనమీఁదవచ్చు దం ♦ భోళినిట్లు
పంకజోదరుఁడాడిసి చేఁ ♦ బట్టియును.

ఇఁక నింద్రుఁడేమిచేయఁ గలఁడు. వానికిఁ గృష్ణునిశక్తి యజేయమనుటస్పష్టమయ్యె. శ్రీకృష్ణదేవుఁడుపరమేశ్వరుఁడను జ్ఞానముదయించినది. హరిసన్నిధానమహిమచే నజ్ఞానాంధకారము తొలఁగినది. స్వాభిమానమంతరించి హరిపై భక్తియుదయించినది. ఇఁక నాయింద్రునెడఁ ద్రిలోకాధిపతినను గర్వము కలికానికైనను గానరాదు. శునాసీరుండు కరంబులమోడ్చి మ్రొక్కెను. లేచినిలువఁబడి నుతింపసాగెను.

కృష్ణా దేవకీనందనా! ధన్యోస్మి ధన్యోస్మి బుద్ధివచ్చినది. నీవు సాక్షాత్పరమేశ్వరుండవు. సృష్టి స్థితి లయకారణుండవు. సర్వేశ్వరుండవు. నారదునిచేవినియు నీమహిమాంశము

కి మానవమాత్రుఁడవని తలఁచి రజోగుణవశంబునఁ ద్రైలోక్యాధిపత్యమదంబున నింత యపరాధంబొనర్చినాఁడ. దుష్టనిగ్రహ శిష్టపరిపాలనార్థ ముర్వినవతరించిన పరమపురుషుండవను జ్ఞానము కలిగినది. నేరంబుల సైఁచి మన్నింప వేఁడెద. సర్వంబునకు నీవకర్తవు నేను దాసుండ. సర్వంబును నీయధీనము. గోవర్ధనోద్ధరణంబునఁ జూచియు విడలని నాయజ్ఞానము నేఁటితో వదలినది. పూర్ణముగా వదలినది. ఇపుడీశిక్షచే నాగర్వముఁ దొలఁగించి నీస్వరూపంబు నెఱుఁగ బోధించితివి. నాపాపము తెల్ల నడంగె. పరమేశ్వరా! యనుగ్రహింపుము.

ఉ॥ పాపములెన్ని చేసిన నపార కృపారసపూరితస్ఫుర
ద్రూపుఁడవైననీపదసరోరుహముల్ మదినెంచుచున్న నీ
చూపొకయింత యేరివయి సోఁకిన బంధము లూడ్చి పాపముం
బాపదె ఘోరసంతమసభారము భానుఁడు వోలె మాధవా!

ఇట్లు దివస్పతి యమ్మురారాతికి సభక్తికపునఃపునః ప్రణామంబులాచరింప నాతని లేవనెత్తి యాదరించి కౌఁగిటం జేర్చి తనయందు నిలీనంబగు నతని వజ్రాయుధంబు మఱల నిడియె. సుత్రాముండు మహాత్మా! తమరీ మహీతలంబున నుండు దనుక నీపారిజాతంబును దమసన్నిధి నుంచుకొని యనంతరము మాఱల నాకుఁ బ్రసాదింపవేఁడువాఁడ. అని ప్రార్థింప 'సురేంద్రా! యీనీమఱఁదలు కోరుటం జేసి భక్తురాలికోర్కె-

దీర్ప దీనింగొంపోవ నెంచితిని గాని వేఱుకాదని. తొలుత నిరాదరణ భావంబునఁ బరుషోక్తులనుడివిన యతనిపై నించుకయేని కోపంబు సూపఁడయ్యె. భగవంతుఁడు భక్తపరాధీనుండు గదా! 'అగ్రజా! ధర్మజ్ఞుండవై యథావిధిగఁ ద్రిదివంబేలు కొమ్ము పోయివచ్చెదఅని తెల్పి యనుగమ్యమానులగు నిలింపులకు నిలువ నాజ్ఞయొసంగి సత్యతో గరుడునధిరోహించి గమనోన్ముఖుండయ్యె.

## శ్రీకృష్ణుఁడు మహికిఁ బారిజాతముం దెచ్చుట

సత్య ప్రాణేశ్వరుం డొనర్చిన యమానుషచర్యలంగని యద్భుతమందుచు, నింద్రాదులు సల్పిన పరమస్తోత్రంబుల విని యానంద వివశయగుచు, శ్రీకృష్ణధ్యానావలగ్నయై కొంత తడవు ప్రపంచమును మఱచి ముకుళితనయనయై యుండి, మఱలఁగనులఁ దెఱచి యామాయాధారుని ప్రేరణచే లోలాత్మకయై నాథా! సత్వరంబున ద్వారావతి కరిగి నాముద్దు చెల్లింపుఁడన దేవకీ తనయుఁడు ఖగపతికిఁ బయనంబునకు మొదల నిడి చానతో బులుఁగుఱేని నెక్కె. తార్క్ష్యుండు మహీతలాభిముఖుండై వచ్చుచుండ సరసిజ నయనుం డాసరసిజనయనకు సురతరు వరమహిమలఁ దెలుపుచు నందందుఁ గనుపట్టు భూలోక విశేషములఁ జూపుచు, నింద్రలోక విశేషముల నుగ్గడించుచు, మందహాసరుచుల సుందరీమణి నలరించుచు నాపంకజాక్షి జంకెన చూపుల కలర్చుచు, శృంగార భావంబుల బచరించుచు. నాశృంగారమయాంగుఁడా శృం

గారవతితో ద్వారావతి యంతికంబునఁ బొదలు రైవతకాద్రి పొంతకు వచ్చి యాగె, ఆజాడం బట్టి వాడవాడలంగల యదు వృష్ణి భోజవంశీయులగు రాజవరేణ్యులా బాలవృద్ధంబుగ నెదుర్కొని కృష్ణుని దర్శించి నమస్కరించి నేత్రాంజలుల నా సత్యా కృష్ణుల లావణ్యామృతంబుఁ గ్రోలుచుండిరి,

కృష్ణుండు రాజమార్గంబు దరియఁ బారిజాతతరుపరిమళంబులు భుగుల్కొని మున్నెవ్వరు నెన్నఁడు నెఱుంగని వింతయొనర్చుచుండె. మహారాజవరేణ్యుం డరుదెంచునప్పటికి సభాస్థానంబు సర్వపరికరంబులతో సలరారు కరణి నత్తిరు రాజసమాగమంబుచేఁ బురరాజంబు సర్వవస్తుసమాజ సమృద్ధంబై సంశోభితమయ్యె.

సీ॥ విరివిగా నొకవేళఁ బెరిగి పీటికినెల్ల
నిజశీతలచ్ఛాయ నిగుడఁజేయుఁ
బిన్నగా నొకవేళఁ బెనుఁవ్రేలి యంతయై
చూడ్కులకెంతయు వేడ్కసేయుఁ
వింతగా నొకవేళ వివిధభూరుహపుష్ప
సురభిగంధంబుల జోడుముట్టు
వేర్వేర నొకవేళ వివిధకాంచనరత్న
పరిపక్వ ఫలములఁ బరిణమించు
నభిలషించినరూపంబు లభినయించు
నుల్లమునఁగోరుకోరిక లెల్లనొసఁగు

సత్యాభామాగృహారామ నిత్యమైన
పారిజాతంబు విస్మయాపాదియగుచు

మఱియు నా వేల్పుమ్రాని సువాసనసోకిన మాత్రనె తత్పురీవృద్ధ జనంబులెల్లఁ దరుణవయస్కులైరి. పెరుగుముద్దలంబోలిన శిరంబులు నీలమణి తులితకచనిచయంబులఁ జెలువారె. వికలాంగంబులెల్ల ఋజుతరాంగంబులయ్యె. దంతవిహీనులు కుంతదంతవంతులైరి. ఆహా యేమి యావృక్షమహిమ! చెవిటివారలు విననేర్చిరి. జన్మాంధులెల్ల వ్రాయఁదొడఁగిరి. కుంటివారలు పరుగిడ మొదలిడిరి. దరిద్రులు సర్వవస్తు పరిపూర్ణులైరి. చిల్లగింజ సోఁకిన మాత్రమున మాలిన్యంబుఁ దిగఁద్రోచి జలంబులు నిర్మలములగునట్లయ్యానిమిష తరువర కుసుమ విసర పరిమళమువలన జనమ్ములెల్లరును లోపంబులఁబాసి సర్వపరిపూర్ణులైరి.

అయ్యెడఁ గృష్ణుండు సత్యభామాసహితంబుగా నాగాంతకునిడిగి గృహప్రవేశంబుసేసి జననీజనకులగు దేవకీవసుదేవులకు సాష్టాంగదండప్రణామంబులాచరించి బలభద్రునకుఁ బ్రణమిల్లి, గురుపురోహిత బంధుజనంబులయెడ వినయమ్ముసూపి, మిత్రజనంబులఁ గవుంగిలించి, బ్రాహ్మణాశీర్వాదంబులఁ గైకొని సుతసోదరామాత్యులొనర్చు నతుల కభినందించి వారినెల్ల నాదరించె. అనంతరము 'ప్రేయసీ! మొన్న నీకడఁ బ్రతినఁ గావించిన ట్లిపుడదీనిం దెచ్చియిచ్చితి. సఖు రుక్మిణియెడఁ గలిగిన యలుక దీఱెఁగదా! దీనిం గైకొమ్ము' అని యపారిజాతుఁ జూపా

జాతము నావారిజాతముఖికి బహూకరించె. అద్దేవియుఁ బ్రముదితాంతరంగయై దేవదేవుని బలువిధంబుల వినుతించి హరిచరణంబుల వ్రాలె.

పిమ్మట శ్రీహరి శుభముహూర్తమ్మునఁ బౌర జనమ్ములను, షోడశసహస్రాంగనలను భార్యలను రావించి బ్రాహ్మణోక్త మంత్రంబులతో నామహీరుహతిలకమును సత్యభామాగృహారామవాటికం బ్రతిష్ఠించి యనుదినంబు నర్చాపూజలం గావించుచుండె. అపుడు పదియాఱువేలసవతులును సత్యభామ యదృష్టంబున కబ్బురపడుచు, నింద్రుజయించికల్పకంబుఁదెచ్చిన కథావిధానముఁ జెప్పుకొనుచుఁ, గృష్ణునందే భక్తినిలిపి యెల్లరు నైకమత్యంబున మెలంగుచుండిరి. హరియు నెల్లగరితలయందు నరమరలేనికూరిమి నెఱపుచుండె. భగవంతుఁడు భక్త్యనుసారంబుగా ఫలప్రదాతయగును గదా!

పరస్పరానురాగము.

అహో! లోకోత్తరతరూత్తమంబొసంగి సత్యం దనియించిన యాపురుషోత్తముఁడు తమకట్టి వేల్పుచెట్టునీకుండెనని యీర్ష్య వహించుమించుబోఁడి హరిచేడియలలో నొక్కతెయైన లేదు. ఇది వాసుదేవుని మహానుభావతయో యాంగనాంగుల సద్భావమో గదా! వారిజాక్షుండు వారలకుఁ దనపైననురాగంబుట్టిపడ మధురాలాపంబుల, సువిలాసహాసాదుల నవ్విలాసవతులఁ దనియింపుచుండు. రాధామందిరంబునకరుగ నమ్మధురాధర నిజవాక్సుధాధారల మాధవునిఁ జొక్కించుచు నర్ఘ్యపాద్యాదివిధుల

నారాధించుచుండు. మిత్రవింద యయ్యరవిందనాభుని సౌంద ర్యంబున కచ్చెరువందుచుఁ గెందమ్మివిరులఁ దచ్చరణారవిం దము లర్చించుచుండు. భద్ర నిర్నిద్ర క్తిష్టార వశ్యంబునదా స్యంబుసలిపివశ్యునింగావించుకొనిపతివలనవిద్యారహస్యంబులె ఱింగిపరితృప్తినొందుచుండు.శుభలక్షణాన్వితయగులక్షణ పుండ రీకాక్షునివలన భక్తిజ్ఞాన లక్షణంబులెఱిఁగి యభినందించి వంద నంబులాచరించుచుండు. కాళింది యాగోవిందుని సుందరాంగం బునకు నవనవశృంగారంబులఁ గావించుచుఁ దిలకంబుదిద్దుచు, సరోక్తులాడుచు నానందంబుజనింపఁ జేయుచుండు. జాంబవతి జాంబూనదకలశజలంబుల నయ్యంబుజాక్షు పదజలజంబులఁ గడిగి తడియొత్తి క్రొన్ననల నర్చించుచుండు సుదంతి యింతిఁ తనరాను సంతసంబున భజించుచు హస్తకంకణంబులు ఘల్లున మ్రోయఁ జారుచామరంబునవిసరుచు, నయ్యనంతునివలన నుత్తమధర్మము లెఱుంగుచుఁ గడుంగడువినమ్రమైయుండు. ఇంక సత్యభామసపర్యలకు మేరయేలేదు. మనరుక్మిణియందమా యెప్పుడుననన్యయే. చేడియలెల్లరు నా వేడుక కాని వేడుకల-జూడఁగోరువారే! చంద్రచకోర న్యాయంబుగా నందఱు నా చంద్రబింబాననుసమాగమంబునుబ్రతీక్షించువారే!ఆబోటులెల్ల రు నాహాటకచేలుని మాట తేనియల కువ్విళ్లూరువారే! గాని తమకుఁ బారిజాతంబొసంగకుండెనని యీర్ష్యవహించువారును, విరసోక్తులాడువారును, అనురాగవిహీనలునుగారు. ఇట్లాకళా విశారదుండు నిరక్షీరన్యాయంబున నవ్వేలందులతో మెలఁ

గుచు సర్వేశ్వరుండవై యుండెదు. ఏకపతులగు సతులనుం బరస్పరకలహములులేక యేకోదరన్యాయముగ నుండునట్లొనర్చుట సర్వజ్ఞునకే చెల్లుఁగాక

—: శ్రీకృష్ణుఁడు రుక్మిణీ సత్యభామల భక్తిం బరీక్షించుట :—

గోవిందుఁడొక్కతఱి రుక్మిణీసదనంబుననుండ నాసతీతిలకము హరికిఁ బరిచర్యలఁగావించి సురటిఁగైకొని నిలువంబడి విసరుచుండ నామెహృదయనిశ్చయంబు వెల్లడింప యదువల్లభుండిట్లనుడివె.

కృష్ణ-రుక్మిణీ! నీసవతులు కనకపీఠంబులపైఁ దత్తద్దేవతలనావహింపఁజేసి యెన్నియో వ్రతంబుల నెప్పుడు సలుపుచుందురు. నీవట్లుసేయవేల?

రుక్మి-మహాత్మా! నాహృదయపీఠంబున నెడబాయక యధివసించిన తమనుదప్ప నితరులఁ బూజింపనేల?

కృ-సతీ! ఆ యాదేవతలం బూజించినంగదా వారువరముల నిత్తురు.

రు-సర్వవరంబులొసంగు తమరు చెంగటనుండ నితరులవరంబులేల?

కృ-దేవీ! నేనేవరప్రదాతనందువేని సత్యమె కోరుము వరముల నిచ్చెద.

రు-పరమేశా! సర్వవరములఫలంబుగా నీవునాస్వామివై యుండ నాకింకేమివరములు కావలయు?

కృ వైదర్భీ-అట్లనియెదేల? కల్పవృక్షమువంటిదాని దేనినైనం గోరుమిచ్చెద.

రు-కల్పక కల్పవృక్షమవగు స్వామివి నాయెదుటనుండ నాకుఁ గల్పవృక్షాదులేల?

కృ—కల్పవృక్షము నీకు లేకుండెనని కొంచెంలిట్లనుచున్నావు.

రు— జగదీశా! సర్వాత్మరూపుఁడవై సచ్చిదానంద మయుం డవగు నిన్నుఁ జంద్రుని వెన్నెలవలె నెడఁబాయ కుం మనని యెఱింగియు నన్నిట్లననేల?

కృ— నీకుఁ బుష్పమిచ్చితిననిగదా సత్య పట్టుపట్టి చెట్టు దెప్పించుకొనియె! నీవుఁగూడ దేనిసయినఁ దెప్పించుకొనరాదా? నీవుమాత్రమట్టిదానవు కావా?

రు— స్వామీ! పరిశ్రుతులకు భేదమని తమరెఱింగినదే కదా! ఏను తమను హృదయముచే విడువని పట్టుపట్టి సఫలనైతిని వేఱేల?

కృష్ణుఁ డప్పలుకులకు సంతసిల్లి 'సుదతీమణీ! సత్యనాకై వేచియుండుఁ గాన నేగి మరలివచ్చెద' నని సత్యాభవనంబునకేగి యామెచే సేవింపఁబడుచు నావనితామనోనిశ్చయంబు నెఱుంగనెంచి యుండ.

సత్య—ప్రాణేశ్వరా! పునర్దర్శనభాగ్యముఁ గలిగించితిరి. కృతజ్ఞురాల. నేడింత యాలసించితిరేల?

కృ—భామా! సాధుజనులతో సంభాషించుటవలన నింత తడ

వయ్యె. నేఁడు నీచెల్లెంద్రు నిను దర్శించి. పారిజాతము
దర్శించి యేగిరా?

సత్య— చిత్తము అందఱునువచ్చి యర్చించిరి.

కృ— మీయక్క రుక్మిణికిఁ గల కమహిమనంతయు నెఱిం
గించితివా?

సత్య— చెప్పితిని తమరింద్రలోకమునఁ గావించిన యద్భుతం
బుల్ఁ గూడ వాక్రుచ్చితి. అందఱును సంతసించి తమను
గొనియాడిరి.

కృ— బాగు బాగు. నేఁడురుక్మిణీసదనంబున కేగవలసియున్నది.
నీకుం జెప్పవచ్చితి; అరిగి వచ్చెద

సత్య— తమకవసరము లేనిదెపుడు? ఎపుడును దొందరయే.
నేఁడు దయచేసి నను ధన్యం జేయుఁడు. రేపరుగ
వచ్చును.

కృ— సుందరీ! యట్లుకాదు. ఏగవలయు. నేఁడు క్షీరాబ్ధిద్వా
దశి గదా! శ్రీమహావిష్ణువు క్షీరాబ్ధినుండి నిద్ర లేచెడి
పుణ్యదినము. నేఁడు తులసీసహితముగా భగవంతు
నారాధించుట ముఖ్యము. తులసీ సమీపమున దీప
ములవెలిగించినను, తద్దీపదర్శనము చేసినను సర్వపాప
క్షయమగును. నేఁడావ్రతమును రుక్మిణి యాచరిం
చును. తప్పక వచ్చునట్లు ననుఁబ్రార్థించినది. వచ్చెదనం
టిని. నీవుఁగూడ వచ్చుటమంచిది.

సత్య— సరిసరి! నేనుమాత్రి మాచరింపఁదగదా! నేఁడునేను

పారిజాతమునుద్దేశించి వ్రతము సేయవలయును. తమరు గూడ నుండి నాముచ్చట చెల్లింపుఁడు

కృ— మంచిదియే. అది తులసీవ్రతము గదా! తప్పక యేగ వలయు.

సత్యా:—స్వామీ! తులసీవ్రతమా! అన్నింటికంటె నెక్కువకాఁబోలు. దానికి దమ రేగుటయేగాక నేనుగూడ రావలయునా! బాగుగాఁజెప్పితిరి.

కృ:—చెలీ యట్లననేల? ఆయమ నీకంటెఁబెద్దదిగదా! నీవిష్టం డౌమె నెన్నఁడును దర్శింపనేగుటలేదు. మీయక్క యెప్పుడు నిటకునచ్చుచుండునుగదా! రమ్ము ఇరువుర మేగివత్తము.

సత్యా:—పెద్దయగుటకేమిలెండు. నావ్రతమునుమాని రాఁజాలనా నారామికిక్షమింపుఁడు. ఇదెనమస్కారము.

కృ:—మంచిది ప్రేయసీ! వాగ్దానప్రకారమే నేగవలయు. నీవు వ్రతము నాచరించుకొనుము.

సత్యా:—అనుగ్రహించి త్వరగాదర్శనమిండు.

అని సత్య కొంతదూరమంపి తదాజ్ఞచే నిజగృహంబుఁ బ్రవేశించె. కృష్ణుఁడు రథారోహణమొనర్చి చనుచు "ఔరా! సత్యగరువము పారిజాతలాభముచే నినుమడించినది. రుక్మిణి చెంతకరుదెంచుట యభిమానముగాఁదోఁచుచున్నది. తులసీవ్రత మన్న సామాన్యముగా నెంచుచున్నది. వీరిభక్తితారతమ్యమెంచగా రుక్మిణిది యనన్యభక్తి అదిపరిపూర్ణసముద్రమే. ఆమె

శుద్ధసత్వమునకు లోటులేదు. సత్యభక్తియా సగుణమైపూర్ణమై నదియేకానియామెస్వభావముఅభిమానమును, ఆభిజాత్యమునువ దలకున్నది. తులసీకారణమునమఱలనిపుడామెగర్వభంగముఁగా వించిరజోప్రవృత్తినడంచి, శుద్ధసత్వవతినిగా నొనర్పవలయు దీనికి మఱలనారదుఁడే కారణమగుఁగాక 'యనుకొనుచునేగె.

నారదుడుసత్యకుఁబుణ్యకవ్రతముపదేశించుట.

అంతంగొన్నిదినంబులకు వీణాముని సర్వచిత్రపరిశోభితంబై సర్వేంద్రియానందకరంబగు సత్యభామాప్రాసాదంబున కరుదెంచె. సత్యయు, సఖీజనంబులునమ్మహర్షిపుంగవునివీక్షించి సపర్యలఁగావించిరి. సత్యపరమహర్షంబున నభివందనం బొనర్చి నిలువ నారదుండభినందించి "అమ్మా! సాత్రాజితీ! నీవకదా కృష్ణపత్నులలో నెల్లఁ గడుధన్యవు. అష్టైశ్వర్యవంతురాలవు. స్వామి పారిజాతమునునీకయొసంగి నీయందవ్యాజానురాగంబున మెలంగుచున్నాఁడు. సపత్నులెల్లవశవర్తినులైయున్నారు. సర్వపరిపూర్ణవగు నిన్నేమనిదీవించువాఁడ. నేను నీకేవరము నిచ్చుటకు నవకాశముగన్పట్టదు. అమ్మా మంచిది. దీర్ఘసుమంగళీభవ. బిడ్డా! ఇంతనుండి "శ్రీకృష్ణపరమాత్మ సత్యభామావిధేయుఁడనఁబరఁగుఁగాత" మనిదీవించె. సత్య ముసిముసినగుచు "తండ్రీ! తమయుపకారముననే నెంతయుఁ గృతజ్ఞురాలను. అయ్యా! హృదయేశుండు సర్వదామన్నించుపరమధర్మముపదేశింపుఁడు. యథోక్తంబుగా నాచరించుదాన" ననసారదుండిట్లనియె.

దేవీ! సర్వజగత్కారణుండును, సచ్చిదానందమయుఁడును, సర్వనియంతయు, మాయాతీతుఁడునగు శ్రీకృష్ణభగవానుని భర్తనుగాఁబడసినమహావ్రతం బాచరించితివి. ఇంక నీకు సలుపఁదగు వ్రతనియమాదులెవ్వియులేవు. కాని యొకపరమవ్రతంబు గలదు. అడిగితివిగానఁ జెప్పెదవినుము.

పురుషుండు తపో యజ్ఞ దాన కృచ్ఛ్ర చాంద్రాయణాద్యుత్తమధర్మంబులవలన నైహికాముష్మికసుఖంబులఁ బ్రాపించు. వనితామతల్లులు పరమపాతివ్రత్యంబున, నుత్తమవ్రతంబుల వలనను నిత్యసుమంగలీత్వంబును, భర్తృవాల్లభ్యంబును, సత్సంతానాద్యైశ్వర్యంబులను, మనోవాంఛా సిద్ధిని, బడయుదురు. అందు నీవాచరింపఁదగు వ్రతరాజం బెద్దియన. పుణ్యకవ్రతము. దానిమహిమమింతయన శేషునకైన నలవి గాదు. అఘ్యాది ప్రబలవాతూలంబు తూలజాలంబుం బోలె నెట్టి ఘోరదురితంబులనేని క్షణమాత్రంబునఁ బటాపంచలఁ జేయును. పరశుభంబులఁ, జతుర్విధ పురుషార్థంబుల నొందుట కయ్యది సాధనము. ఆవ్రతరాజం బాచరించి గౌరీదేవి పరమేశ్వరున కర్ధాంగియయ్యె, లక్ష్మి వైకుంఠపతి యురంబు నెక్కి నెఱజాణయయ్యె. శారదాదేవి చతుర్ముఖుని వదన సౌధంబున నధివసించె. శచీదేవి త్రిలోకేశ్వర వల్లభయయ్యె. అరుంధతీదేవి యావ్రతశేఖరం బాచరించుటంజేసి బ్రహ్మపుత్రుఁడగు వసిష్ఠమహామునీంద్రునకుఁ బత్నియై యెరికిం జూడ నలవిగాక పరమపతివ్రతా శిరోరత్నంబై సకల జగద్విఖ్యాతిం గాంచె.

అది తదితర దుస్సాధ్యంబు. మఱియు, షోడశ సహస్రాంగన
లును సవతులెల్లరును, నీమాటకు జవదాటరు కావున, పారిజా
తంబు లభించునట్లు జేసియు నద్దాని నలుప నిప్పుడ నీవ తగు
దువు. ఆవ్రతంబునఁ బ్రాణేశ్వరు నుత్తమ బ్రాహ్మణునకు
దానంబిడవలయు. నీవట్లొనర్ప నీసవతులును నీకు బనులాడఁ
జాలరు. జగద్విభుండు నీయాజ్ఞావర్తియేగదా! ఇంతయేల సక
లైశ్వర్యోపేతవగు నీవానోము నోఁచనర్హవు.

ఆపరమపవిత్రము చైత్రశుద్ధనవమీ ప్రభృతిగా నొక
మాసమాచరింపవలయు. వ్రతారంభపూర్వదివసముననే నిర్మల
హృదయముతోఁ దొంటి కోపముం దిగనాడి సవతుల యిండ్ల
కేగి పేరంటమునకై వారలనెల్ల నామంత్రించిరావలయు. ప్రారం
భదినమునఁ దెలతెలవాఱునెడ నిదురలేచి నదీజలముల స్నాన
మొనర్చి దివ్యదుకూలాభరణాదులం దాల్చి నెఱికురుల
విరులసరులఁ బచరించి, యంత నత్తమామలకుఁ బ్రాణేశునకు
గురుజనంబులకు నమస్కృతులఁ గావింపవలయు, ఆరంభించిన
దాదిగా దినదినముం బసుగుకుముత్తయిదువులఁబూజించి,ఘన
సారసుగంధముల వారినలంకరించి, చిత్రనూత్నాంబర
రత్నాభరణాదులచే నాసువాసినీ జనంబుల బహూకరించుచు
నొకమాసంబు జరిపి పిమ్మట నుద్యాపన మొనర్పవలయు.

ఉద్యాపనమునకు పవిత్రమహోత్సవస్థలము నలంకరించి
యచ్చటకు భూసురబాంధవ పౌరమిత్రసువాసినీపరిజనవర్గంబు
లనెల్ల రావింపఁదగు. దాని మంగళవాద్యహృద్యంబుగా స్నాన

ర్పవలయు అంత నాచార్యుఁడు చెప్పిన చొప్పునఁ గల్పోక్త ప్రకారంబుగా భర్తతోఁగూడ నోమునోఁచుకొని వ్రతాంత మునందుఁ బ్రాణేశ్వరుని రత్నాభరణ పారిజాతపుష్పాదులచే నలంకరించి, కల్పకప్రసవ మాలికలచేఁ బారిజాతతరువునకుం గట్టి, యుత్తమవంశజాతుండును, శాంతుండును, పరమకారుణి కుండును, వేదాధ్యయనాది సంపన్నుండునగు బ్రాహ్మణోత్తమున కుఁ బారిజాతముతోఁగూడ దానమీయవలయును. తదుపరి షోడశమ హాదానములు, భూరిదక్షిణలుం బరితృప్తిగా విప్రులకొసంగి భక్ష్య భోజ్యాదులతోఁ గూడ నెల్లవారికి నన్నప్రదానంబుఁ గావింప వలయు. ఇట్లు సమాప్తిసలిపిన నావ్రతంబు సర్వాభీష్టముల సమకూర్చును. పిమ్మటఁ బతిని దానముగొన్న విప్రునకుఁ దగు ద్రవ్యమొసంగి వానివలన హృదయేశ్వరుని మఱలఁబడయ వచ్చును. ఇది యుసర్వోత్తమ ప్రకారంబు. అమ్మా! నీ వ్రతంబు నెఱవేఱుఁగాక' అని దీవించి నారదుం డేగె.

—: స త్య భా లో చ న ము :—

పిమ్మట సత్యభామ నారదోపదిష్టవ్రతము సలుపనిచ్ఛ పొడమ 'ఇమ్మహాకార్యం బెట్లు నెఱవేఱును. నేనాభిజాత్యాభి మానంబులదిగనాడి యింటింటికేగి సవతులం బిలిచిన వచ్చి వారు విధేయులగుదురుగాక. అయినను భర్తను దానమిచ్చుట కిష్టపడుదురే! వారు కలహంబునకుఁ గాలుద్రవ్వ నేనేమిసేయఁ గలదాన వారియిష్టంబు లెట్లున్నను దొలుదొల్తఁ బ్రాణేశ్వ రుం డీకార్యంబున కామోదింపవలయుఁగదా! మనోనాయ

కు నిందలకొప్పించుటెట్లు? నేనిద్దాని నారంభింప నిది నేఁటి వేఁటి
క 'అయ్యవారిం జేయఁ బోవఁ గ్రోఁతియయ్యె' నన్నట్లగునేమో?
పెద్ద లిద్దానిఁ గొద్దిసేయఁ బదుగురిలో నగుబాట్లగును గదా!
'పూలమ్మిన యూరఁ గట్టెలమ్మె' నన్నట్లు సర్వజనులలోఁ బేరు
ప్రఖ్యాతులందిన నేనిందప్రఖ్యాతిఁ బొంది తలవంపవలయునేమో? ఏ
మి సేయుదాన?... ఏమినా యిూపిచ్చియూహ. ఇట్లనుకొన నేల?
ఈవ్రతంబు సర్వోత్తమంబుగాని చో నారదుఁడు నాకేల యుప
దేశించును? అమోఘసంకల్పుండగు నామునీంద్రు నాశీర్వాద
ము విఫలంబగునే? 'హరిసత్యభామా విధేయుఁడయ్యెడు' నను
మునిమాట రిత్తవోవునే? ఈవ్రతంబున కీవుమాత్ర మర్హురా
లనని నుడివిన ముని వాక్యంబు దిగఁద్రోఁచి వ్రతం బెట్లు సలుప
కుందును. శ్రీహరి యనుగ్రహంబున్న చో నెట్టి దుష్కరంబు
లైనను సుకరంబులేయగు. కొంచెము పట్టుఁబట్టినంతనే వారి
జాతంబ నుగ్రహించినవిభుం డిపుడీ నామనోరథం బీడేర్ప
కుండునా! ఆస్వామి నాపెన్నిధానము. దానమిడినవస్తువును
ధనమిడి మరలంగొనఁ దగునని మునీంద్రుఁడు నుడివెఁగదా!
ఎంతయైననిడి కొనుదాన. సత్కార్యములనువిడువక సేయుట
యుత్తములలక్షణంబు. దీనికి శ్రీకృష్ణభజనంబె సర్వార్థసాధకం
బగుఁగాక.

శా॥ ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించిపరిత్యజింతురురువిఘ్నాయత్తులైమధ్యముల్

ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరుసుమీ. ప్రజ్ఞానిధుల్ గావునన్
అనియిట్లు వితర్కించి మనోవాక్కాయంబు లేకంబు సేసి, యంబుజోదరు దివ్యపాదారవిందచింతనామృతపాన విశేషమత్తచిత్తయై యనన్యంబుమఱచి ధ్యానించుచుఁ దన్మయత్వంబున నుండెఁ దత్సుకృతంబు పరిపాకంబు నొందెనోయనునట్లు.

సీ॥ బాఱనుగొల్వఁగా మీఱువక్షమువాఁడు
తలచుట్టివచ్చునేత్రములవాఁడు
చిక్కనిపాల్గారు చెక్కులుగలవాఁడు
మెఱుగు చామనచాయ మేనివాఁడు
విడికెంపు నణగింపు బింబాధరమ్మువాఁ
డున్నతాజానుబాహువులవాఁడు
చిగురాకులనుగేరు నగుపాదములవాఁడు
డంబైనకంబుకంఠంబువాఁడు
నెమిలిఱెక్కతురాఁబూను నెఱులవాఁడు
మొలకనవ్వులఁ దగుముద్దుమొగమువాఁడు
మదనకోటులఁగొనగోట నడుమువాఁడు
చారుతరమూర్తి గోపాల చక్రవర్తి.

సత్యకనులయెదుటఁ బ్రత్యక్షమై నిలిచిన నాధన్యురాలు విస్మయంబంది వాసుదేవుని బలువిధంబులఁ గీర్తింప నాపరమేశ్వరుండు 'భామినీమణీ! నీధ్యానంబునకు మెచ్చితి. వరంబు

గోరుమిచ్చెద' నన నావిరిబోఁడి యదియుయదనని నారదోప దేశంబును వినయంబున నెఱిఁగించె కృష్ణుం డాలోచించి నాగ దుఁడు వేసిన బీజంబు•నాటెనని తలంచి 'వనితామణీ! యిట్లు భర్తను దానము సేయఁగోరి విభునిట్టి వరము గోరువారుకలరే? ఎంత వెఱ్ఱిదానవు. అయినను భర్తనుమఱలఁగొనవచ్చుననియు, లోకోత్తర వ్రతముసలిపి ప్రఖ్యాతిగాంచవచ్చుననియుఁ గదా! నీకోరిక. మంచిది. ఇది సద్వ్రతంబు గాన సత్యముదప్పక నీ యిష్టంబు సమకూర్చువాఁడ. కానిమ్ము'అని యొడంబడియె.సత్య యానందించె.

——— ◆ సాత్రాజితి పుణ్యకవ్రతం బాచరించుట ◆ ———

శ్రీకృష్ణభగవానుని సహాయంబుచే సాత్రాజితి.వ్రత ప్రయత్నంబుల సలుపుచుండె. యథోక్త దినంబున నారదుండు చెప్పినచొప్పున నప్పడంతి శుద్ధమనస్కయై సవతుల నాహ్వా నించి వచ్చి యావిభావరి సుఖనిద్రం జెంది, యుషఃకాలంబునం బావననదీజలంబుల సుస్నాత యైశ్వశ్రూశ్వశురుల యాశీర్వ చనము లంది, యథోక్తంబుగా వ్రతంబాచరించుచుండె. సత్య పంపిన సువర్ణశుభలేఖలు సర్వదేశీయులహస్తాంబుజములనలంక రించుచుండె. వ్రతోద్యాపన మహోత్సవసమయంబు సమీా పించె. ద్వారకాపురంబెల్ల నవనవరచనావిశేషములచే నలం కృతమై వైకుంఠమోయనఁనొప్పె.ఉద్యాపనస్థలము పారిజాతతరు సన్నిధానమున నేర్పఱుపఁబడి రత్నస్తంభాదులచే నతిమనో జ్ఞంబుగా, నతివిస్తీర్ణంబుగానమర్పఁబడియె.అచటలోకోత్తరంబై

సొగసుల వెదజల్లు పందిరుల నిర్మించిరి. వానిపైఁగట్టఁబడినచాందినులయందుఁ జిత్రింపఁబడిన నవరత్నములకట్టడములు నక్షత్రములవలెను, సాలభంజికలు గ్రహములవలెను దేజరిల్ల, నాపందిరులు నభోంగణమువోలె శృంగారముగఁ గన్పట్టుచుండె. వానినడుమఁ బారిజాతతరువుచెంత నుద్యాపనమండపము నెలకొల్పఁబడి సువర్ణస్తంభములు, మణికుసుమమాలికలు, పల్లవతోరణంబులు, వింతవింతలగు నూతనవైఖరులం జనరి నది దేవేంద్రుని సుధర్మను గ్రేణిసేయుచుండె. దానిచుట్టును సుఖస్పర్శములు, నతిమనోజ్ఞంబులునగు మణిపీఠసహస్రమ్ము లంతరాంతరంబులుగా ననుర్పఁబడియె. దేశదేశంబులంగల స్త్రీపురుషులు శకటాదివాహనంబుల నధిరోహించి లక్షోపలక్షలుగా నయ్యుత్సవంబునకరుదెంచుచు, దానిం గాంచినఁ దమజన్మము సార్థకంబగునని తలంచువారును, సత్యాకృష్ణుల దర్శనంబుచే ధన్యులమగుదుమనుకొనువారును, భర్తను దానంబిడు వ్రతంబెందును జూడమైతిమనుకొను వారును, సత్య విభునిదానంబిడ నవతు లెట్టిష్టపడిరో యనుకొనువారునునై తత్ప్రదేశంబుచేరిరి

వేడుకఁజూడ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది జనంబులు, రాజాధిరాజులును, సార్వభౌములును, సనకసనందనాదులును, వసిష్ఠ వామదేవ నారద జాబాలి మార్కండేయాది దేవర్షిప్రభృతులును, పరమబంధువులగు పాండవులు, కౌరవులు, పాంచాలురు, నందాదిగోపాలురు, ద్రౌపదీ సుభద్రాది కాంతామతల్లులును, మఱియు మధురాపురీగోకుల వా

స్తవ్యులు, బంధుమిత్రాదులును, సకుటుంబములుగా రథగజతు రగశిబికాది వాహనంబు లధిరోహించివచ్చి సత్యాకృష్ణులచే సత్కృతులై యానందాబ్ధి నోలలాడుచుండిరి. ద్వారకాపురం బెల్ల జనసంకులంబై యుండె. అమ్మహాకార్యంబునకు గర్గ మహర్షి యాజకుఁడుగా నియమింపఁబడియె. మునిసత్తము లనేకులు ఋత్విజులైరి. భీమార్జునాదు లందఱి పనులెల్ల నెఱ వేర్చుచుండిరి. అమ్మహోత్సవంబున నపూర్వవస్తుజాలంబు నేత్రానందంబును, గాన వినోదాదులు కర్ణానందంబును, సుగంధరసాసారంబు ఘ్రాణానందంబును, మధురాహారపదార్థములు జిహ్వానందమును. హరియాజ్ఞచేమలయపవమానుండు దేహేంద్రియానందంబును గావింప సభాజనులెల్లను నానందపరవశులగు-చుండిరి.

ఆయుద్యాపనదివసంబున సత్యాకృష్ణులు పావనజలంబుల స్నానమాడి దివ్యాభరణసంశోభితులై పీతాంబరముల ధరించి లక్ష్మీశ పీతాంబరులట్లు తేజరిల్లుచు రత్నంపుఁబల్లకీల నెక్కివచ్చి తన్మండపమధ్య సువర్ణపీఠంబుల నలంకరించిరి. సత్యా సవతులెల్లరు నచటికే తెంచిరి. గర్గమునీంద్రుఁడు యథోక్తంబుగా సాత్రాజితిచే నాయుద్యాపనము నాచరింపఁజేసె. అందా వాహనము సేయఁబడిన దేవతలెల్లరుఁ దదారాధనలచే సంతృప్తులైరి. విధానమంతయు సక్రమంబుగాజరిగె నందు.

క. వేదదనివాదము నాశీ

ర్వాదనినాదము ♦ ననేకవాదిత్రమహా

ఒకరిపుణ్యముకంటె నొకరిపుణ్యవిశేషము గణనాతీతమని వేఱ చెప్పనేల? దానమిడినవారికిని గైకొన్నవారికిని మహాఫలం బొసంగు శ్రీహరిమహిమ నెవరు వర్ణింపనేర్తురు! మహాత్ముల చరిత్రవిభూతు లొకదానికంటె నొకటి యెక్కుడై మితిలేక యుండునుగాదె!

చ॥ తనఫలకోపమస్ఫుటల, దాల్చు ఫణీశ్వరుఁడీజగంబు, నా
తని దనువీపుచే నెపుడుఁ, దాల్చు మనుండను కూర్మనాథుఁ, డా
తని వహియించు ఘోణిపతి, తాల్చు మహాంబుధి వీరినందఱం
దనరఁగ మేరలేనివిగదా మహనీయచరిత్ర సంపదల్

—— * కృష్ణపత్నుల పరితాపము * ——

అంత నారదుండు వీణాకమండలు దర్భాసనాదులఁ గృష్ణునిచే మోయింపుచు ద్వారకలోని వాడవాడలఁ ద్రిప్పచుఁ దద్భార్యలు చూచుచుండ 'భృత్యా! యింక వెంటరావేమి? రమ్ము లెమ్ము' అని గద్దించుచు హరిని బలుకష్టములఁ బెట్టుచుండె. కృష్ణుండు నారదుఁడు పెట్టు కడగాండ్లఁబడుచు మునియాజ్ఞాపరికారము వర్తించుచుండె. భగవంతుఁడు భక్తపరాధీనుఁడుగదా! కృష్ణపత్నులు విభుఁడు సేయు నూడిగములఁ జూడఁజాలక, యట్లుకష్టపెట్టవలదని మునిని వేఁడుకొన వచ్చిరి. కాని యాతండిందు రావలదనుటచే నాచేడియలు మాఱాడ లేకుండిరి. ప్రాణవిభుని వియోగంబు భరింపరాకుంటచే నందఱును గుమిగూడి 'ఔరా సత్య యెంతపనిచేసె. వెంటనే భర్తను గొని యిత్తునని చెప్పి మోసగించె. ఇందఱకు నాథుఁడగువానిఁ

పతినాథునిగా నెంచి యెట్లుదానమీాయ సాహసించె? ఆమె యిట్టి యధర్మమాచరించెనని దూఱనేల? మాానాథు నీవల దని మనమేల యాటంకపఱుపకుంటిమి. ఇప్పటి మనయీాయా రాటము మనకపుడేలలేకుండె? అపుడు మనబుద్ధియేమయ్యెను. ఈ మనపరితాపము గతజలసేతుబంధనముగదా! నారదుని వేడుకొనఁబోవ మనమొర యరణ్యరోదనమయ్యె. నారదుఁడు విభుని మఱల నిచ్చునోయీాయఁడో! ఈకున్న మనమేమి సేయగలము! ఏమిసేయఁగలమనుకొననేల! సత్యకడకేఁ మా విభుని మాకీకున్న నీప్రాణంబులఁదీసి మాప్రాణంబుల దీసి కొండుమని కలహింతము. స్వామిదయతప్పటచే నిట్లు తటస్థ మయ్యెఁగాఁబోలు ఏమనుకొన్న నేమిప్రయోజనము. కార్య ము మించినది మనయదృష్టమెట్లున్నదో

క॥ పెట్టిన దినములలోపల
నట్టడవుల కైనవచ్చు వానార్థములుం
బెట్టనిదినములఁ గనకపు
గట్టెక్కిననేమిలేదు గదరా సుమతీ!

మనప్రాణదేవు నారాధించుటయే మనకు శరణంబు కాని వేఱులేదు'అని తదేకహృదయలై శ్రీహరిని జింతించుచుఁ బరితప్తహృదయలైరి. సుదతీమణులకుఁ బతివియోగము దుస్సహంబు గదా!

సత్య వ్రతమును సాంగముగా నెఱవేర్చి తనను గృత కృత్యఁగాఁ దలంచుచున్నను ఆమానవతీ మానసంబు దానమి

డినదాదిగా నామానసీయుని క్షణమేని విడిచియుండలేదు. ఆమెకు హరిని వీక్షింపని త్రుటికాలము కల్పకోటిశతముగాఁ దోఁచుచుండె. నారదుఁడు మఱల నెప్పుడురప్పట్టునో, విభు నెప్పుడు కొంపునో యని యారాటపడుచు నింటి గుమ్మముకడ నిలిచి యుండె.

—♦ నారదుఁడు కృష్ణుని శ్రమపెట్టుట. ♦—

నారదుఁడు కృష్ణుని సత్యయింటిచెంగటికిఁ గొనివచ్చి యయ్యంగనకనుఁగొనుచుండఁగృష్ణునిపైనుండు పీతాంబరమును దాఁగైకొని తనపైశాటిగుడ్డను హరికిఁగప్పి తనకమండలువు నాతనిశిరంబుననుంచి 'ఓయీ నారదభృత్యా! యీదలిజలము పరమశివుని జటాజూటమునుండి తేఁబడినది. ఒకబిందువైనఁగిందఁ బడెనేనినీకుశిక్షయగుసుమీ! జాగ్రతగా నా వెంటఁబరుగెత్తుము' అనఁగృష్ణుఁడు ముని చెప్పినట్లు చేయుచుండె.

సత్య:—(తనలో) అకటా! మహాప్రభువున కీచింపిగుడ్డయు, భూతలేశులచేఁ దనయాజ్ఞను శిరమున మోయించు నా స్వామికి చెంబుల మోయుపనియును, దివ్యవాహనంబులపై నేగునానాథునకుఁ బాదచారివృత్తియును గల్పించి నేనెంతయుపరాధినినైతి. కటకటా! యీశ్రమ యెట్లు చూడఁగలదాన.

నార:— కృష్ణా! ఈ దర్భాసనమును బ్రహ్మదేవుఁడు మెచ్చి నాకొసంగినాఁడు. దీనినీవు మోసి తెచ్చి నాకు జపకాల

మున నాస్తరణముగా వైచి జపానంతరము కట్టి వెంటఁ
బెట్టుచుండుము.

సత్య:—అయ్యో! సకలజగత్పరిపాలనాధారము మోయు లోకే
శ్వరుండు తోళ్ళను మోయవలసెనా! ఇట్టిమాటలు
విన నెంతపాపమొనర్చితిని.

నార:— వాసుదేవా! యిది నామహతివీణ. ఈవిపంచివంటిది
ప్రపంచమున నెందునులేదు. దీనిని బ్రహ్మగాంధర్వవ్యాక
మును బాడుటకై శ్రుతిచేసియుంచినాఁడ; నీగోరుతాఁకిన
శ్రుతిచెడును చెడిచితివేని నీకుశిక్షయగునుసుమా,

సత్య:—ఔరా! నారదుఁడెంతకఠినముగాఁ బలుకుచున్నాఁడు.
శ్రుతిచెడినఁ బతినిశిక్షించునేమో! లోకద్రోహుల
శిక్షించు సర్వాధ్యక్షునకుఁగూడశిక్షతప్పదుకాఁబోలు.
అట్లైన నాప్రాణములు నిలుచునా?

నార:—నందనందనా! యిదినాస్ఫటికాక్షమాల. కడుఁబవిత్ర
మైనది. దీని నీమెడలోవైచుకొని చిక్కుబడనీకుము;
కడుజాగ్రతసుమా!

సత్య:—కట్టా! దివ్యరత్నహారములఁదాల్చుమన్మథాకారుఁడుసన్న్యా
సులుధరించు పాలపూసల మెడఁగట్టుకొనవలసెనే?
ఏమికాలగతి!

నార:—నారదశిష్యా! ఇవిగోయివినాచిటితాళములు. వీని
వాయించుచు వీణనుభుజంబునందాల్చి కమండలువు
పడకుండ మస్తకంబుననునిచి తాళము తప్పకవేయుచూ

నడుఁగుచిప్పనీక భగవద్భజనము సేయఁగలవా?

కృ:—స్వామీ! చిత్తము, తమయాజ్ఞాప్రకారముచేసెద. కీర్తనముచెప్పెదరా?

నార:—యశోదాకిశోరమా! రమ్ము. నాట్యముసరిగాఁజేయుము కీర్తనమునేర్చుకొనుము. చెప్పుచున్నాను. నాతోఁగూడ ననుము,

కీర్తన జంఝూటిరాగము. ఆదితాళము.

రామకృష్ణగోవిందనారాయణా|కృష్ణారామగోవిందనారాయణా

౧. రామకృష్ణా పరంధామాసచ్చిదానంద|కోమలాంబుదశ్యామ నారాయణా ॥రామ॥

౨. వాసుదేవాముకుంద, వనమాలాచక్రధర|నారసింహాచ్యుత, నారాయణా॥రామ॥

౩ అండజవాహన, పుండరీకాక్షా,య|ఖండతేజస్స్వరూప,నారాయణా॥రామ॥

నారదుఁడన్నయట్లయనుచు తాండవకృష్ణుఁడు బ్రహ్మాండతాండవ మొనర్చుచుండె. సత్యభామ కృష్ణునటనంబున కబ్బురమందియు 'కటకటా! నామగనికీటుల నటనంబునేర్చుచు నీజటాధారి నావిభుని దనవలెసన్యాసినిగాఁజేయఁగాఁబోలు. ఇప్పుడింతచేయునీముని యిఁక ముందేమిచేయునో! దీనినేఁజూడఁజాల, మహానీంద్రుదు వేఁడి పతింగొనియెద'నని నారదునికి|మొక్కి 'సంయమివరా! పతివియోగంబు భరింపఁజాల. అనుగ్రహించి విభుని దయసేయుఁడు'ఇట్లు వేఁడుకొన నారదుఁడు 'సతీ! దాన

మిచ్చినవాని మఱలనిమ్మందురే? నీనాథుండు నా సేవకుండయ్యె ఎవ్వరైనను దమకుపయోగించువాని విడువనిష్టపడుదురే? నాకు వలయు పనులకెల్లను సహాయుఁడగు నితనివిడువ నామనసొప్ప కున్నయది పొమ్ము'అన నాభామ పిడుగడంచినభంగి నిర్విణ్ణ హృదయయై మఱలఁ దెలివొంది 'మహాత్మా! తమరిటులనుడువ దాసురాలెట్లోర్వఁగలదు. మఱలవిభునొసంగునట్లువాగ్దానము చేసిన తమరిటుల నుడువుమరేని యేనెట్లుజీవించుదాన! ఎపుడో యిడుదునందురేని వైళంబమేఘుఁడు వర్షింపనిచో గ్రీష్మతాప తప్తములగు తీవియ లెట్లుబ్రతుకఁగలవు. కటాక్షింపుఁడు అని తీఁగవలెఁ గాళ్లపైఁబడి పెనగి విడువక దీనయైయున్న చానఁ గరుణించి 'మానవతీ! మంచిది నీవు నీవిభుని గొనఁదలతేని ప్రతిఫలముగా హరియంతభారముగల ధనరాశి నిడినచో నిడఁ వాఁడ'నని వేడుకతబిసికుడివె

## —: శ్రీ కృ ష్ణ తు లా భా ర ము :—

ఆ వెలందిమునిపలుకులకలరి, యట్లెధనమొసఁగికొనుదాన. అని నమస్కరించిహరితోఁగూడమునివరుని నిజమందిరంబునకుఁగొం పోయి చెంగట విశాలప్రదేశంబున నమ్మహాపురుషునిఁ దూఁప యత్నించె, ఆక్షణంబ యచట రత్నస్తంభములఁబాతించి, వానిపై వజ్రమయంబులగు దూలంబుఁ గీలుకొలిపి, దానినడు మ రెండు బంగరుపళ్లెరముల మొనలంగూర్చిన గొలుసులతో నమర్పఁబడిన పెద్దత్రాసు నేర్పఱచె. అంతమునియాజ్ఞచే నాప నమాలి, శేషునిపైనధివసించు శ్రీమహావిష్ణునిభాతి నాపెద్ద

తిక్కోకయం దొకటైపు చక్రంబున సుందర సువిలాసభాసుర వదనచంద్రమండలము మందస్మితచంద్రికలీనఁ గూర్చుండె. అమ్మహావినోదంబుఁజూడ జనులువేనవేలుమూఁగిరి. అతులాభారంబు చూచువారికిఁ జెప్పుకొనువారికిని గడువింతగానుండె. అపుడు సత్యభామ హరికిసరియగునని యెంచి నూఱుకోట్లవరాలం దెప్పించి ధటరెండవపళ్లెరమునసుంచె. అవి హరికి సాటిరాలేదు. భామకొండలంబోలు వరాలకుప్పలఁ దెప్పించి యుంచునిచె. త్రాసు కదలనైన లేదు. సత్యయచ్చెరు వొంది నవరత్నరాసులనునిచె. అపుడుగూడ నటులనయయ్యె. అంత నయ్యింతి సర్వాభరణంబుల సర్వధనరాసులం బోయించెఁ గాని యథాప్రకారమే. దేవశిరోరత్నమునకు మానవలోకరత్నములు సాటియగునే! సత్యమోము చిన్నవోయె. ఇది యింద్రజాలమో యనుకొనుచు నింటిలో సువర్ణరజతతామ్రకాంస్యాది లోహజాలములఁగూడ నిడియె. ఎవ్వియైననేమి! అన్నియు శ్రీహరి పాదాంగుష్ఠమునకు సరికాకుండె. సత్య దీనయయి కృష్ణుని ముఖబింబమును వీక్షించెఁ గాని నారదాజ్ఞ లేమింజేసి హరిపలుకఁడయ్యె. నారదునిపంకఁజూచె. నారదుఁడు 'అమ్మా! యింకనే పదార్థంబులైన సరిగాసడి విభునిగొ'వ్వనియె. అంతనాలేమ యింటిలోని వస్త్రపాత్రాదులనెల్ల నిశ్శేషంబుగాఁ దెచ్చివైచెఁగాని యేవియు హరితోఁ దులదూఁగ నయ్యె. 'గుండ్లకమ్మ నాగుక్కకా పాలేరునాప్రక్కకా!' యన్నట్లు బ్రహ్మాండభాండోదరున కేవిసాటియగును? చతు

రైశ భువనాత్మకంబగు ప్రపంచమెల్లఁ దనలో నాల్గవభాగము గాఁ గొన్న స్వామికి, జగంబునెల్ల నొక్కచరణంబుగాఁ జేసిన దేవునకు సాటివచ్చునదెద్ది? కృష్ణుఁడేమైనఁ జెజ్జెఁగెనా? లేదు. యథాపూర్వమగు నాకృతితోనుండె. అయిననేమి? ఆస్వామి సంకల్పమట్టిది. భక్తులకుఁ దనమహిమ తెలుపనటుల సంకల్పించె. అయ్యది సత్యభామకేకాదు. మఱియెరికేని యా దివ్యసంకల్ప మెఱుంగరాదు. అందఱదిచూచి యాశ్చర్య పడిరి. హరింగని యబ్బురపడుచు సత్యచేసినపనికిఁ గొందఱ ట్లనిరి.

గీ॥ సొమ్ములీయవచ్చు సొమ్మెల్లనిడవచ్చు
నీయరాని ప్రాణ మీయవచ్చు
తనదువిభుని వేఱు తలిసిచేతికినిచ్చి
తాళవశమె యెట్టిదానికైన

——♦ కృష్ణపత్నులు సత్యతోఁ గలహించుట ♦——

ఆహా! ముందువెనుక లారయక, సాధ్యాసాధ్యములఁ గలపోయక తెలివిమాలినపని చేసికొనిన యాసత్య యిఁక నేమిసేయఁగలదు? పాపము ఎట్లయినఁ బతిని వశపఱచు కొన నెంచెనుగాని తగిన యుపాయము నెఱుంగకయింతచేసె. భగవద్భక్తుం డెఱుంగని నారిపను లిట్లె పరితాపకరంబు లగు ను గదా!

చ॥ అనుచితకార్యమే నుచితమాపనియేసి యొనర్పఁబూనువాఁ
డొనరఁగముందెఱాఁగలప్రయోజనముంబరికించుటొప్పు; వే

పనియొనరింపఁదత్ఫలము ప్రాణములుండెడిదాఁక మానసం
బును దహించుచునిక్కము గభూతలమందునశల్యమట్లుగన్

ఆయువతీలలామం బేమియుఁ దోఁపక విభుని ప్రతిమా లీనయోఁ బ్రసన్నురాలై తనను గృతకృత్యనుగాఁ జేయునని యెంచి హరిం బలుకరింపఁ జూచెను. కాని కృష్ణుండు నారదాజ్ఞచే నపుడు మౌనముద్రాధారియై పలుకఁడయ్యె. సత్య వెగటొంది 'కటకటా! మునీంద్రుండిఁక విభునితోఁ మాటాడుటకుఁ గూడఁ బ్రాప్తములేకుండఁ జేయుఁగాఁబోలు' నని వగచి ఘర్మతాపతప్తమగునవమాలికాలతచాడ్పున స్రుక్కియుద్విగ్నమానసయై యొంటిగా నొక్కచోటఁ గూర్చుండె. నాఁడు రుక్మిణికి వ్రతదినంబుగాన నామె యచటికి రాలేదు. తక్కిన కృష్ణపత్నులు సత్య తమ్ము నంతచేసెననియు, హరియింకఁ దమవాఁడు గాఁడఁనియు, దుఃపోసి కోపవిచారములు నిలుపఁజాలక సత్యయున్నచోటికి వచ్చి యిట్లనిరి.

మిత్రవింద:—అక్కా! యెంతచేసితివమ్మా, వ్రతమనితలపెట్టి యేమేమోచేసి యందఱకు నిట్లన్యాయముగావించితివి కదా!

సత్య:—ఊరకొండసుఁడమ్మా. నాకాటముగానున్నది. నేనేమి చేసితిని? నారదుఁడిందులోదింపి మననుముంచినాఁడు.

కాళింది—నారదుఁడేమిచేసెను? ఎవరెవరో యిట్టివ్రతముచేసి రని మునితెలుప నదిమనకుసాధ్యమా యసాధ్యమా యనియెంచక వారిని బోలినదాననుగావలెనని యింతి

చేసితివి. నక్కయెక్కడ నాకలోకమెక్కడ? బాగు బాగు. దానమిచ్చిన వస్తువును మఱల నెట్లు కొనవచ్చు ననుకొంటివి ?

సత్య:—ఏమీపిచ్చిమాటలనుచున్నారు. కోరుమూయుడు. ఇంకేచెల్లెలుదానిని రేపు భర్తచే విశాఖుడగుశాస్తి చేయించుదాన. ఏను నారదుండు చెప్ప నిది చేసితినా ?

భద్ర:—ఏమమ్మానీవాక్కౌశలము. ఉపాయమెఱుంగక భర్తను గోల్పోయిననీవు భర్తచేమాకు శాస్తిచేయింతువా ? ఏమితాఱుమాఱుగాం బలుకుచున్నావు.

సత్య:—ఏమీ ఉపాయమెఱుంగక చేసితిననుచున్నారు ? ఈవ్రతముసంగతి మీరుగూడవింటిరిగదా! అప్పుడేలవద్దన కుంటిరి? ఇప్పుడు వాదమాడవచ్చితిరా? చాలుపొండు.

సుదంత:—అక్కా మాకీరహస్యము చెప్పితివాయేమి? ఏమో వ్రతమని విఱ్ఱవీఁగుచుఁ దెలివితక్కువపనిచేసి 'తాఁజెడ్డ కోఁతి వనమెల్లఁజెఱచె'నన్నట్లు మమ్ముఁగూడ నింతకుఁ దెచ్చితివి. సరియేకాని యందఱకువిభుఁడగుహరిని నీ వెట్లిచ్చితివమ్మా ?

సత్య:—ఎట్లిచ్చితినా ? చేతులలో నిచ్చితిని. పతియొప్పుకొనె నిచ్చితిని. ఏమినాకునీయాజ్ఞయా? పొమ్మూ.

శాధ:—అక్కా! పతియొప్పుకొనెననుచున్నావు. వారు స్వతంత్రులుకారా? ఇప్పుడుపతికా? చింతమనకా? పతికేమి మనవంటివారల మఱల నెందఱనైనఁ బెండ్లియాడును.

మనగతియేమి? పాలలోవిషముగలిపితివిగదమ్మా!

సత్యా:-నేనేమివిషముగలిపితిని? మునిమాటలను నమ్మిచేసితిని. విభుఁడుఁగూడ విషబుద్ధితో నిట్లు చేయించెఁగాఁబోలు. 'నల్లనివెల్లనీళ్ళు; తెల్లనివెల్ల పాలు' అనుకొని నేనెట్లున మ్మకుందును. ఇంతకును మనప్రారబ్ధమిట్లున్నది. ఇంకెవరి నేమనవచ్చును ?

లక్షణ—ఏమమ్మా నీనయగారపుమాటలు 'గాలింగొ దీపము వెట్టి దేవుఁడా నీమహిమ' యన్నట్లు నీవిట్లుచేసి వారి పైఁబెట్టుచున్నావు. తన్నుఁగట్టఁద్రాళ్లు తాఁదెచ్చుకొనెనన్నట్లు నిగారవమింతకుఁ దెచ్చుకొంటివి. నీస్థితి మాకేల? మాభర్తను మాకిమ్ము.

సత్యా—నేనీయనేల? మీరేసరియగు ద్రవ్యమిచ్చికొనరాదా?

జాంబవతి—ఆ!ధనవతిననుకొనునీగర్వమిప్పటికణఁగెఁగా!ఆఁడు దానిచేతి యర్థమన్నట్లు ఆనన్నెలు, ఆచిన్నెలు నిన్ని ప్పుడింతకుఁదెచ్చినవి. అప్పుడేనీకుఁ దగుబుద్ధి సెప్పకుండుటచే నీమూలమున మేముగూడ మోసపోతిమి. ఇఁక చాలును.

అనియిట్లందఱును సత్యనుదూషించి మనకర్మమెట్లున్న దోయనుకొనుచుఁ జేయునదిలేక నారదాములున్నచోటికరిగి విచారవదనలై చూచుచుండిరి. నారదుఁడు 'కాంతామణు లారా! మీరెవ్వరైనను సరియగుద్రవ్యమిత్తురేని హరినిచ్చె 'వాఁడ' నని చెప్పెఁ గాని వారలు 'సత్యపనియింతయాయ్యె.

మున మెంతవారము. అడుసుద్రొక్క నేల? కాలుగడుగ నేల? అనుకొనుచు మిన్నకుండిరి. పాలుద్రావి పరుగెత్తుటకంటె నీరుద్రావి నిలుచుటయే మంచిదిగదా!

—: సత్య కృష్ణుని ప్రార్థించుట :—

సత్యభామ పతివియోగదుఃఖమొకవైపునను సవతుల ములుకులవంటి పలుకు లొకవైపునను దీంద్రించ నింతింతనరాని చింతచేఁ జేయనగునదేమియు లేక, యభిమానంబు విడఁజాలక హరియేశరణమనికృష్ణుంజేరవచ్చె. అయ్యెడనారదుఁడెవ్వియో వినోదములఁ గృష్ణునితో ముచ్చటించుచుండెను. కృష్ణుఁడును దక్కడనడుము సుఖాసీనుండై చిఱునగవుల నారదుని మోము నలరించుచు మాటాడుచుండె. అదియ విన్నపమునకుఁ దగు వేళయని సత్య హరినిట్లుప్రార్థింపఁదొడంగె.

'నాథా! భవదీయ కరుణాకటాక్షవీక్షణముల నాపైఁ జిలుకకున్న నే నెట్లుజీవింతు? చంద్రకిరణప్రసారము లేకుండెనేని చకోరికలు, మేఘుఁ డమృతబిందువుల వర్షింపఁ డేని చాతకాంగనలును జీవింపనేర్చునే? మహాత్మా! ద్రౌపదీమానరక్షకుఁడవని ప్రఖ్యాతిఁగన్ననీకు నాగౌరవంబుకాపాడుట వెక్కసంబయ్యెఁగా! కంటినిఱెప్పలో లెనెల్లెడల నేలినస్వామియెడనే నప రాధినినైతినా? పదియాఱువేవురసుదతులలో మన్నించిన యీయాఁడుదానినేల నిపుడేల యిష్టముగాకుండెను? నిరుపమ సుఖాంబుధిం దేలించి, యిపుడిట్లుసేయ వెగటైతినా? ఎల్లప్రొద్దుల ముద్దుగుమ్మలలో నెల్లఁబెద్దచేసి యిపుడీ ముద్దురాలిని

రడిసేయ నీకు మనసయ్యెఁగాఁబోలు. తోడిచేడియలమాటఁ గైఁబడనీక కాపాడిన మానవతిని నగుబాటుసేయింప నింపయ్యెనా? వన్నెన్నను వినక తప్పయు ముద్దుచేయుచుఁ బెద్దపెద్ద ప్రియవస్తువుల నేఁబ్రొద్దులం గూర్చి నీకిడ్డన నిట్టి కొద్దికోర్కెఁ గీర్ప బరువయ్యెనా? మనోహరా యని పిలిచినమాత్రమునఁ గొండవలె నుప్పొంగు నీకీ ధనకనకాదులతోఁ దులఁ దూఁగుట పలుచనగాఁదోఁచెనా! ఎల్లవేళల నిను హృదయదైవంబుగాఁ నెన్నుకొను నాభక్తి నీమదికెక్కకుండెనా! అనాథనాథా! సన్నిట్లనాథను జేయుట జగన్నాథుఁడవగు నీకుఁదగునే? నాయెనర్చిన పని తగనిదియేని తొలుదొల్తఁ దెలిపి వలదనరాదే? నాలోపంబుఁ దెలిపి శిక్షింపరాదే? ఈయవమానవియోగములెల్లు భరించుదాన. గోటిమీఁద రోకటిపోటన్నట్లు మనఁబు పెకలించు నీసవతుల పోరెట్లు చల్లారును! తెఱువెయ్యది ఉపాయంబు బోధింపరాదె? పలుకవేమి? హా! యెంతవచ్చె.

ఇట్లు గోరవంక పలుఁగుకైవడిఁ బలువంకల నల పంకజనయన నెలవంకల పొంకముల బింకము జంకువఱచు కనుగొమలఁ జెలువారు విభుని పిడకవేఁడుచుఁ బలవరింపఁ దొడఁగె. కృష్ణుండదివిని 'ఓనారీమణీ! యేనిం కేమిసేయువాఁడను గాను. నీవ్రతంబు సర్వోత్తమం బనుటకు సందియంబు లేదు, నేనీ విషయమున నారదుని యాజ్ఞచొప్పున మెలంగ వలయును. భృత్యుండు ప్రభునియాజ్ఞమీఱఁ దగదు. కావున

నారమని యిష్టానుసారము నడుచుకొనుము. వారియాజ్ఞలేక నే మాటాడుట దోషము’ అనియె.

——— సత్యకు నారదుఁడుపాయము చెప్పుట ———

సత్య—మునిచంద్రా! స్వామివారిట్లనుచున్నారు. ఈబిడ్డను దమరనుగ్రహింపకున్న గత్యంతర మేమి?

నార—అమ్మా! యేనేమిసేయువాఁడ. దానమిడిన విభుని దులదూఁగు ద్రవ్యమిడి కొనకున్న వ్రతముసఫలము గానేరదు.

సత్య—స్వామీ! యేమిచేసినను దమరేచేయువలయును: ఏ ధనమును దులదూఁగకుండదా! యేమిత్రోవ?

నార—బిడ్డా! యీస్వామి కేధనములును దులదూఁగకుండుట సత్యమే. అటులని యింతపనిచేసి వ్రతము నిష్ఫలము చేసి కొందువే? భాగస్వామినులయ్యు నీసవతులలో నొక్కరేని నీకు సాయము గాకుండిరి. ఏమి సేయవచ్చును?

సత్య—సరి. పతివిషయమున నందఱును భాగస్థురాండ్రే. వారి జోలియేల?దయచేసి తులదూఁగునుపాయమును దెలుపుఁడు.

నార—భామా! యేనేమిసెప్పెద. నీవేయూహించి భర్తను గొనఁ గలిగితేని కొనుము.

సత్య—అయ్యా! తమరుపాయ మెఱుఁగరా? ఈవ్రతముసలిపినచో స్వామి సత్యభామాధీనుఁడగునని యాశీర్వ

దించితిరిగదా. ఎట్లు? సత్యభామ కితరభామలచే నవమానమగుట తమకిష్టమయ్యె నే?

నార:— హరిహరీ! సతీ! యట్లనకుము. జనకులు బిడ్డలంజెఱుపఁ జూతురే? తల్లీ! "సిధ్యంతికుతసుకృతానివినాశ్రమేణ" అనుటంబట్టి శ్రమపడనిచో సుకృతములు ఫలింపనేరవు. నాయాశీర్వాదము ఫలింపకపోదు. గట్టిగాఁబ్రయత్నింపుము.

సత్య:— స్వామీ! యింకనెట్లుప్రయత్నింపవలయునో యానతిండు ఉపాయమెఱుఁగకున్నదాన.

నార:— బిడ్డా వినుము. ఒక్కొక్కయెడఁ దృణీకరింపక యుపయోగించినచో స్వల్పౌషధమే రోగపరిహారకమౌను. పెద్దయౌషధముగాదు. కావున నీస్వామి కేపదార్థము నాటియగునో పెద్దల నాలోచించుటయుక్తము. అందుకుమీయక్కరుక్మిణి యింటనున్నదిగదా! ఆమెనేఁడేలకో యిక్కడికి రాలేదు. ఇట్టి యాలోచనముల నభిమానముంచుకొనఁదగదు. అమెనడుగుము. ఏపుట్టలోనే పాముకలదో యెవఁడెఱుంగును? తక్కినసవతులు నీకంటెఁజిన్నవారుగదా! పాపము. పసికాయలు వారేమి సేయనేర్తురు ?

—♦ హరి తులసీదళముతోఁ దులదూఁగుట. ♦—

ఇట్టి యమ్మునిమాటల కలరియు, నాత్రిలోకసుందరి యెల్లరచే సేవింపఁబడుతానేగ తనగోదు.రుక్మిణితో నెట్లుచెప్ప

కొంమనా యనునభిమాన మొకప్రక్కఁ బీడింపఁ దుదకుమన సురాయిచేసికొని రుక్మిణియింటికేగె. అప్పుడువైదర్భి తులసీపూజఁ జేసికొనుచుండెను. సత్యరుక్మిణికి నమస్కరించినిలువంబడియె. రుక్మిణిచూచి "అమ్మావచ్చితివాక్షేమమే. యనియాదరించి" చెంగటఁగనకపీఠంబునఁ గూర్చుండబెట్టుకొని' సోదరీ! దీనవదన నైతివేలయని మందలించె. సత్యచెప్పఁజాలక తనవ్రతస్థితిని దెల్పె

రుక్మిణి:-సోదరీ! మంచివ్రతమునలిపితివి. బాగుబాగు. నేఁను తులసీవ్రతమగుటచే నాకు రావీలుకాలేదు. అయిన నిప్పుడులోపమేమి!

సత్య:-అక్కా! యేమందును. భర్తనుదానమిచ్చితిని. అందుచే...

రుక్మిణి:-నారదుఁడు మఱలభర్తనొసఁగకుండెనాయేమి ?

సత్య:-కాదుకాదు. హరియంతభారముగలద్రవ్యమిచ్చిననిచ్చెద నన్నాఁడు. సర్వద్రవ్యము వారికి సాటిగాలేదు.

రుక్మి:-వెఱ్ఱితల్లీ! అక్లలచేసితివి! ఆపరమేశ్వనకీడెద్ది! మొదటనే నాశక్త్యనుసారముగా ద్రవ్యమిచ్చి కొందునని చెప్ప కుంటివా! కొండంతదేవునకుఁ గొండంతపత్రిపెట్టువారు కలరే? పైనేమయ్యె ?

సత్య:-అక్కా! యేమిచెప్పుదును! దాఁపక చెప్పెద. ఏపత్నియైనఁ దగుద్రవ్యమిచ్చి కొనవచ్చునని మునీంద్రుఁడు చెప్పె. మనసవతులట్లు చేయఁజాలక నేఁజేసినపనికి మిూఁదుమిక్కిలి నన్నుదూషించిరి.

రుక్మి:-వారును వెళ్లిరివారే. ప్రయోజనమెఱుఁగరు. అట్లయిన నిప్పుడు మనమేమిచేయుదము.

సత్య—ఏమిచేసెదవో, నారదునివేఁడుకొనఁగా నీనాయము కోరుమన్నాఁడు, నాస్థితి యిట్లయినది.

రుక్మి—అమ్మా! నీపని నాపనికాదా! మనకింతకంటె నెక్కువ యేమున్నది. కూర్చుండుము. వెళ్లుదము.

అని రుక్మిణి నిశ్చలభక్తితో దులసీదేవతనారాధించి వ్రతముసాంతముచేసియొకతులసీదళముచేతంగైకొని సత్యతోఁ గూడ హరిసన్నిధికివచ్చి భర్తకు నారదునకునుమ్రొక్కి "మునీంద్రా! మాప్రాణేశ్వరుని మాకొసంగి ప్రాణదానంబుసేయుము' అన అమ్మా! ఇందు నాదోషంబెద్దియులేదు. యథార్థంబున్నుడివితి. హరిని మీకిడినప్పుడు హరికిసరియగుదానినిచ్చి యాతనిఁ గైకొనుట మీకుధర్మము. నీవుగూడ భాగ్యస్థురాలవు. ఎవరైనంగొనవచ్చునను నీవకొందువుగాక' యని మునియనియె. భీష్మతనయ యావచనంబు విశ్వసించి, తానునందలి పదార్థంబులెల్లఁదీయించి కృష్ణునెదుట నిలువంబడి

కం॥ హరికింబ్రేమాస్పదవై
హరిచే గౌరవము నిత్యమొందెదుతులసీ!
హరియించిమాదుదురితము
హరినియ్యెడమాకుమఱల నర్పింపుదయన్

అని నిర్మలహృదయముతో 'వనునిక్కంబుగా జాగ్రత్స్వప్నసు షుప్తుల శ్రీహరిని బాయనిదాననేని యీతులసీదళం

బు మాధవునకు సాటియగుఁగాఁక' అని దళమును ధటయందు నుప నేమిమహిమయోగాని యది హరితోఁ దులఁదూఁగె. తులసియు హరియు సమస్థానంబుననుండిరి. ఆశ్చర్యమాశ్చర్యము! ఆనందము బ్రహ్మానందము అది వినుటకు వ్రాయుటకుంగూడ నానందము. కొందఱది రుక్మిణీప్రభావమనియుఁ గొందఱు తులసీ మహిమయనియుఁ, గొందఱు హరిదివ్యసంకల్పమనియుఁ బొగడిరి.

నారదుఁడు-అమ్మా! రుక్మిణీ! మీస్వామిని నీవుకొనం జాలితివి గ్రహింపుమని కృష్ణునకు డిగనాజ్ఞయొసఁగె. అంతనా లీలావినోది రుక్మిణి కేలుఁదమ్మిఁ గైదండగాఁగొని గరుడపక్షంబుననుండి దిగినట్లు ధటనవరోహించె. రుక్మిణి హరికిమ్రొక్కి 'పరమపురుషా! తొంటియట్ల యీనాసోదరీమణుల ననుగ్రహింపుఁడు'అని వేడుకొనియె. హరిముసిముసినగవుల నగుచు దేవేరిపలుకంగీకరించెఁ హరిపత్నులెల్లఁ బరమోత్సాహవతులైరి. సత్యసంతసమునకు మేరయేలేదు. ఆమెకు రుక్మిణీప్రభావ మద్భుతమను భావముదయించె. బృందావనలోలునకుఁ దులసీ పూజవలె మఱియొకటి ప్రీతికరంబుగాదనితోఁచెఁ అదేమియోగాని సవతి విభుఁగెలిచెనను నభిమానము తొలంగి సత్యకు రుక్మిణిపై భక్తికుదిరినది. ఆమె శాంతరసభరితహృదయయై రుక్మిణి నిట్లుప్రస్తుతించె.

—: రుక్మిణీ సత్యభామల సంభాషణము :—

అక్కా! నీమహిమ మగణ్యము నాబుద్ధిహీనతనుదొలఁగించి, నాయపఖ్యాతినడంచి, గౌరవంబుఁగాపాడి, మాకందఱ

కుంగూడఁ బతిబిక్షనిడిన నీయౌదార్యంబునకు సాటిగలదే? ఇంతిదనుక నిన్నందఱంబలె సాధారణసపత్నిగా నెంచి యప్పు డప్పు డెగ్గులాడిన నాయపరాధంబు క్షమింపుము. ఏనొక్క యెడఁ బారిజాతలోభగర్వంబున హరియెదుట నీతులసీపూజను నిరాకరించితిని, నా తెలియని యీయపచారంబు సైఁప వేఁడు చున్నదాన. మెచ్చునకువచ్చు వీణయు గాయకుని కౌశలము చేతనే మాధుర్యమిడునట్లు తులసీదళముగూడ నీమహాప్రభావ సంపత్తిచేతనే హరితోఁ దులఁదూఁగెనని యేనెంచుచున్న దాన. అక్కా! నాకిఁకఁ బ్రత్యహంబును దులసీ పూజాభాగ్య మనుగ్రహింపుము. ఏనెక్కుడుదానవని విఱ్ఱవీగు నాదురభి మాన గర్వములు నేటితో నడుగంటినవి. నీగోటికైన సాటి గానన్న శ్రీనారదునిమాట సత్యము. సత్యము. వారు . నాకు జనకులు. నీవింతటినుండి నాసోదరివిగావు. సాక్షాజ్జననివి. నిక్కము.అందఱికంటెరుక్మిణియుత్తమురాలని హరినుడువఁబెడ చెవింబెట్టి పాటింపకతూలనాడిననానేరంబుసైరింపుము. నీవు లోకోత్తర చరిత్రవు. నాదుజ్ఞానాజ్ఞాన కృతపాపంబులక్షమింపు ము'అనిసాష్టాంగవందనముఁగావించె.ప్రొక్కినసత్యనులేవనెత్తి,

రుక్మిణి— 'సోదరీ! నన్నిట్లనకుము. ఏనెంతదాన. ఇదం తయు మనప్రాణేశ్వరుని పరిభావము. సూదియంటురాయి సూదినింబోలె మనకును, లోకమునకు సర్వశక్తులనిచ్చి యెల్లర నాకర్షించు సర్వసమర్థుఁడీ స్వామియే. సృష్టిస్థితిలయంబు లీవా సుదేవుని లీలావినోదంబులు. ఆటగాని చేతికీలుబొమ్మవలె నీ

జగన్నాథుని దివ్యసంకల్పముచే లోకములెల్లఁ దిరుగుచుండు. వారిలోతునకైన నంతముండునగాని శ్రీహరిమహిమకంతము లేదు. ఈజగన్నాటకసూత్రధారికి మహాపుణ్యవశమున మనము భార్యలమైతిమి. ఈయాదినారాయణుండు డిదివఱకెన్నియో యవతారములఁదాల్చి యిపుడీ కృష్ణరూపంబున లోకోద్ధరణ ముఁగావించుచున్నాఁడు సోదరీ! యాహికాముష్మికఫలప్రదాతయైన యీజగన్నేతకు మనోవాక్కాయకర్మంబులచే విడువక సేవయొనర్చుటయే మనకుఁ బరమకర్తవ్యంబు' అని బోధించి సత్య నానందనిమగ్నంజేసె.

——( నారదుఁడు తత్త్వముపదేశించుట )——

నారదుఁడు—అమ్మా సత్యా! ఈరుక్మిణిచెప్పినదంతయు నిక్కువంబు. ఈమెవచనములు వేదవచనములే. మీరందఱును లక్ష్మ్యంశములు. ఈకృష్ణుఁడు నారాయణుఁడు. వినుము.

శ్లో॥ శ్రీభూనీళారమాదుర్గా సీతాసత్యాచభామినీ
రుక్మిణీతులసీరాధా సర్వాలక్ష్మ్యంశ సంభవాః.

అనుపురాణోక్తియుఁ గలదు. మఱియు ఈరుక్మిణి సాక్షాల్లక్ష్మియే. 'రాఘవత్వే భవత్సీతా, రుక్మిణీ కృష్ణజన్మని' అను ప్రమాణముంగలదు. ఈమహాలక్ష్మికెద్దియు నసాధ్యముకాదు. శ్రీమహావిష్ణుని భార్యలగు మీపుణ్యము వర్ణనాతీతముగదా !

మఱియొకటి—'శ్రీహరినినేఁగొనఁజాలకుంటిని. నాకుఁ బరాభవమయ్యె' అని వగవకుము. ఇందొక రహస్యమున్నది.

ఎన్నియున.తక్కినచక్కెర గోండులకంటె నెక్కుడుగ మన్ని పారిజాతాదిలాభముల నీకుంగడుంగూర్చినయీజగజెట్టిస్త్రీలకు దులసీవ్రతమన్నింటికంటె ముఖ్యమనితలంచి యట్టి వ్రతమును శెడ్డలమూలమున బోధించుటన్యాయ్యముగానీకంటెంబెద్దయుం బూజ్యయుం. దనకుంబట్టపుదేవియు, నీకుజననీసదృశయునగు రుక్మిణీమూలమున నుపదేశించి నిను ధన్యంజేయందులసీదళము నెక్కుడుగంజూపె. కావున దానికివగవంబనిలేదు.

మఱియొకటి — హరిసత్యభామావిధేయుండగుచున్న నా యాశీర్వాద మెట్లుఫలించెనందువేని, ఇంతకుమున్న నీయెడం బ్రేమదానాదుల నెక్కుడుగంజూపి పారిజాతాదులనిచుట హరి విధేయుండగుటంబట్టియే.ఇపుడునీహృదయదోషలేశములంబాపి తులాభారమిషచే నీకుంబరమశాంతమును. పరమభక్తిని గలి గించి, యన్నిటికంటె నెక్కుడగు శుద్ధ తత్త్వజ్ఞానమును గలిగిం చుటకై యిట్లుచేయుటచే విధేయుండయ్యెనని వేఱచెప్పవల యునే! ఇట్లు హరినిజూఱంగొన్నమీ రెల్లవిధములంగడుధ న్యలు. అమ్మా! మీరందఱును సర్వశుభంబులం గాంతురు గాక. ఇంక నేనేగివచ్చెద' అని శ్రీకృష్ణునకభిముఖుండై నిలిచి

శా. శ్రీకృష్ణాయదుభూషణానరసఖా, శృంగారరత్నాకరా
లోకద్రోహినరేంద్రవంశదహనా, లోకేశ్వరా దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా,నిర్వాణసంధాయకా
నీకుం బ్రొక్కెదం ద్రుంపవేభవలతల్ నిత్యానుకంపావిధీ!

అని మ్రొక్కి సెలవువేడ రుక్మిణీ సత్యభామా కృష్ణులు సుక్కి సంతసమున నారదునివీడ్కొలిపిరి.

—: భ గ వ త్ప్ర సా ద ము :—

అంతఁ గృష్ణుండు రుక్మిణీసత్యలఁ జెంతకుంజేర్చి గారవిం చుచు 'సాత్రాజితీ! వింటివిగదా రుక్మిణీనారదులమాటలు. మాకు భక్తకోటులను ముక్తులంజేయుట స్వాభావికముగాన నిన్ననుగ్రహించుటకై ముని యిడినకుసుమంబు రుక్మిణికిచ్చి తిని. అపుడునీమనంబు ననువిడువకున్నను గించిత్తమోగుణ యుతంబయ్యె.అయిననుభక్తురాలవుగానఁ బారిజాతమొసంగితిని. అంతటఁ దమోగుణంబునదలి నీమదిగరువంబున రజోగుణము చేవర్తించె. అరజోగుణదోషంబు నిపుడు తులాభార చరిత్ర ముచే రుక్మిణివలనంబాపి నీయంతఃకరణమును నిర్మలముఁ జేసి తిని. నీవిపుడు శుద్ధసత్వవంతురాలవైతివి. నాతత్వమెఱిఁగినది గాన రుక్మిణి శుద్ధసత్వవతియై వేషభాషల నిచ్ఛగొనక నా స్వరూపమునే సేవించుచున్నది. ఇపుడు నీవ్రతము ఫలించినది. ధన్యురాలవైతివి. నీచరిత్రము లోకప్రసిద్ధమగుఁగాక' అని నుడివి యోగసర్వేశ్వరుఁడు, ఆసర్వతంత్ర స్వతంత్రుఁడు, ఆజగ న్నాటక సూత్రధారి,

చ॥ ఒకతఱి వేణునాదమున,నొక్కతఱిన్ సువిలాసయుక్తి,నిం
కొకతఱినెక్కసెక్కముల నొక్కెడవాగమృతంపుధార,వే
రొకపరిజ్ఞానబోధనల,నొప్పెడులీలల వాసుదేవుఁడా
సకలవధూటులంబరమసౌఖ్యసుధాంబుధిఁదేల్చునెంతయున్

కృష్ణపత్న్యులై కమత్యముచే నీరక్షీర న్యాయంబున మెలంగు చుండిరి. మఱియు నా పరమేశ్వరుండు దుష్టనిగ్రహ శిష్టపరిపాలన మొనర్చుచు, నిరంతరానంత పరమానందామృతధారా ప్రసారంబున సకలజనవాంఛాలతల ఫలింపఁ జేయుచుఁ, గరుణా కటాక్షవీక్షణంబున సేవకుల దురితంబులడంచి యాధివ్యాధి దారిద్ర్యాదులం బాపి సర్వసుఖంబులిడుచు, దివ్యసంకల్పంబుచే నాశ్రితసజ్జనులకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యంబు లొసంగుచు దాసజనకల్పకంబై జగంబుల నేలుచుండె. తన పావన చరిత్రములం జదువువారికిని, వినువారికిని, సకల శుభంబు లొనగూర్చుచుండె.

ఇది,

శ్రీకాశ్యపగోత్రపవిత్ర ములుకుట్లవంశ పయః పారావార
రాకాసుధాకర పిచ్చమాంబా కృష్ణబ్రహ్మమనీషితనూభవ,
శంకరపండిత, సహోదర, శతావధాని వేంకటకృష్ణ
నామధేయ ప్రణీతంబైన శ్రీరుక్మిణీ పరిభావము.
శ్రీరుక్మిణీ సత్యభామాసమేత శ్రీకృష్ణపరబ్రహ్మా
ర్పణమస్తు. హరిః ఓం తత్సత్
మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ



28-9-41 ఆదివారము

'మధ్యయుగమునాటి ఆంధ్రదేశము' (ఉపన్యాసము)—

శ్రీయుత DR. మారేమండ రామారావుగారు,

M.A., Ph. D.

(గుంటూరు హిందూకళాశాలోపన్యాసకులు.

29-9-41 సోమవారము

'తులసీదాసు' (ఉపన్యాసము)—

శ్రీయుత పండిత కర్ణవీర నాగేశ్వరరావుగారు.

ప్రేమచందుని కళానైపుణి' (ఉపన్యాసము)—

శ్రీయుత ఇలింద్ర రంగనాయకులు గుప్తగారు,

M.A., LL. B.

(గుంటూరు హిందూకళాశాలోపన్యాసకులు)

---

ఉపన్యాసములన్నియు సాయంత్రము 5 గంటలకు ప్రారంభింపబడుచుండును.

ప్రతి దినమునను నికేతనపారకసభ్యులలో నొకరిద్దరు యేదే నొక విషయముపై ప్రసంగించుచుందురు.

అవకాశమునుబట్టి హరికథలు, పురాణకాలక్షేపములు గూడ యేర్పాటుకావింపబడుచుండును.

30–9–41 మంగళవారము

# 23 వ వార్షికసభాకార్యక్రమము

( సాయంత్రం 4-30 గంటలకు ప్రారంభము )

ఫొటో

దైవప్రార్థన

అధ్యక్షుని ఎన్నిక

వార్షికనివేదికాసమర్పణము

అధ్యక్షుని తొలిపలుకులు

ఆటల విజయులకు బహూకరణము

శబ్ద, నేత్రావధానములు— చి॥ కర్ణ రాజా శేషగిరిరావు } విద్యార్థులు
చి॥ లేళ్ళ వేంకటేశ్వర్లు

'గ్రంథాలయములు - స్త్రీవిద్య'— చి॥ కర్ణ ఆదిశేషభూషణాంబ
(ఉపన్యాసము) (8 సంవత్సరముల బాలిక)

ఇతర యుపన్యాసములు

అధ్యక్షుని సభాముగింపు వచనములు

వందన సమర్పణము